# ప్రబోధసుధాకరము

ఆదిశంకరాచార్యకృతము

ఆంధ్రీకరణము
విద్వాన్ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్యదీక్షితులు

పరిష్కరణము-వ్యాఖ్యానము
దేవరాజు శ్రీమహావిష్ణు

# గురుం ప్రకాశయేద్ ధీమాన్

జగదేకాచార్యులు, పూజ్యపాదులు శ్రీశ్రీశ్రీ మచ్ఛంకర భగవత్పాదులవారి ప్రబోధ సుధాకరమును పూజ్యులు గురుకల్పులు శ్రీశ్రీశ్రీ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితుల వారు అనువదించి శిష్యరత్నము శ్రీ దేవళరాజు శ్రీమహావిష్ణువుగారికీయగా వారు దానికి తాత్పర్య విశేషానువాదము చేసి రక్షించి ఇటీవల ప్రచురణమొనర్చ సంకల్పమొనర్చిరి.

శ్రీ కల్లూరి భాస్కరంగారు శ్రీ కాశీవిశ్వేశ్వరశర్మగారి ద్వారా దూరవాణి చేయించి దానిపై అభిప్రాయమును వ్రాయుటకు నన్ను ప్రేరేపించినారు.

నేను పూర్వము ప్రబోధసుధాకరమును చూచియుండలేదు. కాని ఈ సందర్భముగా తదాస్వాదపరమానందము లభించినది. అది నిత్యానందైకరసము, పురుషోత్తమము, అజము, శ్రీ యాదవాధీశతత్త్వము. 'యం వర్ణయితుం సాక్షాత్ శ్రుతిరపి మూకేవ మౌనమాచరతి, సోఽస్మాకం మనుజానాం కిం వాచాంగోచరోఽపి భవతి' అని ఆదిశంకరాచార్యులవారే దాని అగోచరతను అందముగా వర్ణించినను - దేహనిందాది ప్రకరణముల నేర్పఱచి చివరకు సగుణ నిర్గుణైక్య ప్రకరణము అనుగ్రాహక ప్రకరణములతో పూర్తిచేసినారు. చివరి భాగములలో శ్రీకృష్ణుని పరబ్రహ్మభావమును శ్రీకృష్ణలీలలకుగల అద్వైతాత్మ తత్త్వమును ప్రతిపాదించి పారవశ్యమునందు నింపినారు బ్రహ్మశ్రీ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్యదీక్షితులుగారు. గోవూరు (కొవ్వూరు)లో నేను పనిచేయుచున్నప్పుడే సంస్కృత కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా మూడు నాల్గు సంవత్సరములు చేరి చేరువగుట నా అదృష్టము. వారి 'గురుకృపాలహరి' సంస్కృతమూల ఆంధ్ర తాత్పర్యములు సుధామయములు. ఎచ్చట సుధ ఉండునో అచట శ్రీ దీక్షితులుగారి రచన ఉండును. ఎచ్చట శ్రీ దీక్షితులుగారి రచన, అనువాద కావ్యములుండునో అచట సుధయుండును. నారాయణీయము, మూకపంచశతి, ఆర్యాద్విశతి మున్నగున వీ మాటల కుదాహరణములు.

'ప్రబోధ సుధాకరము'న సహజముగ ఆపాతముగ ఆలోచనాత్మకముగను సుధ నిండియున్నది. అచట కూడా శ్రీ సుబ్రహ్మణ్యదీక్షితులవారి సదీక్ష దీక్ష చేరినది. బహుశః ఇది వారి చివరి రచన కావచ్చు. శ్రీ దేవళరాజు శ్రీమహావిష్ణువుగారి మాటలలో ఆ భావము గోచరించినది. దీనిని వ్రాసి కల్లూరివారు శ్రీమహావిష్ణువుకర్పించినట్లైనది.

వేదాంతము అంటే సులభముగా అర్థము కాని తత్త్వమని పండితుల అనుభవము. 'ప్రబోధ సుధాకరము' మూలమే అట్టిది కాక సరళము సుగ్రాహమును అయి సర్వసామాన్య సంస్కృతజ్ఞులకును స్వవగాహము అయినది. కాగా దీక్షితులుగారి అనువాదము చేరి ఆ ప్రబోధసుధ ఇతోఽధికమధురరసమిశ్రితమై ఆనందానుభవ పదమైనది. శ్రీ సుబ్రహ్మణ్యదీక్షితులుగారి స్వతంత్రకవితకు అనువాదకవితకు భేదముండదు. అనువాద కవిత కూడా వారి స్వతంత్రకవితవలె తెలుగునుడితో భావప్రాధాన్యముతో ప్రౌఢగాంభీర్యధ్వనిప్రధానతతో సరళ సుగమతతో ప్రబంధ పరిచయముగలవారిని ప్రబంధ పఠనశీలురను పద్యహృద్యతనాస్వాదించువారిని పరవశింపజేయును.

ఎంత వేదాంతమైనా ఆదిశంకరులవాక్పవిత్రమై రసాస్వాదనము చేయించునట్లు, ఏ విషయమైనా శ్రీ దీక్షితులుగారి నోటబడి అమృతమేయగుననుటలో సందేహము లేదు. 105, 106, 107, 108 శ్లోకములను, అనువాదపద్యములను, 139, 140, 141, 152 శ్లోకములను, అనువాదపద్యములను ప్రబోధ, సగుణనిర్గుణైక్య ప్రకరణములను పరిశీలించినచో విశేషముగా ఈ విషయమవగతమగును. నిజమునకు ఏ పద్యము గుడమధురము, గూఢమధురము కాదు?

శ్రీ మహావిష్ణువుగారు గురుభక్తులు, సరళగంభీర మూలానువాదములకు ఆధునికుల ఆవశ్యకతననుసరించి అనువాదమొనర్చి ఇతోఽధికసరలతమత్వము నీ గ్రంథమున కాపాడించినారు. 'గురుం ప్రకాశయేద్ ధీమాన్' అను నానుడి ననుసరించి వీరి రచన మొదట అనువాద పద్యమును చదువబుద్ధి పుట్టించి ఆ పిదప మూల శ్లోకమును పఠించు సంకల్పమొదవింపజేయును. కొన్నిచోట్ల వీరు తాత్పర్యము స్పష్టము అని వ్రాసినారు. అనగా అనువాదపద్యము మూలశ్లోకములనే శ్రోతలు పునః పునః పఠించి మనన మొనర్చుకొనవలెనని అర్థము. కొన్నిచోట్ల వీరు తాత్పర్యము వ్రాసినచోట్ల మూలముగాని, అనువాద పద్యముగాని కఠినముగా ఉన్నదని అర్థము కాదు. అచట వీరి హృదయముప్పొంగి వీరికి కాళిదాసునకులాగా తద్గుణములు చెవి దూరి చాపలమునకై, వర్ణనకై, వివరణకై ప్రేరణమునిచ్చినవని అర్థము.

మొత్తము మీద 'ప్రబోధసుధాకర' మూలానువాద తాత్పర్యముల మూటి త్రిపుటి వలన భేదత్రిపుటి తొలగి శ్రోతలకు, వక్తలకు, ప్రష్టలకు, సర్వులకును భేదము తొలగి

ద్వైతము విగతమై అద్వైతపరమార్థ శ్రీకృష్ణభగవత్తాదాత్మ్యానుభూతి కలుగగలదని భావించుచున్నాను.

నేను వారి నాన్నగారితో కలిసి పనిచేసిన మాత్రవు భాగ్యముచే నాకు ఈ సదవకాశము నిచ్చిన శ్రీ కల్లూరి సోదరులు శ్రీ భాస్కర కాశీవిశ్వేశ్వరశర్మలకు హార్ద ధన్యవాదములు. ప్రత్యక్ష పరోక్షములుగా ఆశీర్వదించి అధ్యయనము చేయించిన ఆచార్యత్రయమునకు వినయవినమ్ర ప్రణతిశతములు.

ఇందు మూలములోను, అనువాదములోను, తాత్పర్యములోను ముద్రణ స్ఖాలిత్యములను తొలగింప యత్నించు సాహసమొనర్చినందులకును, అందు దోషములున్నచో సుతరాముగను క్షంతవ్యుడను.

భవదీయ

గోవూరు (కొవ్వూరు),

10-4-2012

**దోర్బల ప్రభాకరశర్మ**

విశ్రాంత ప్రధానాచార్యులు,

ఆంధ్ర గీర్వాణవిద్యాపీఠము,

గోవూరు (కొవ్వూరు),

పశ్చిమగోదావరి జిల్లా

# ముందుమాట

అస్మత్ గురువర్యులైన శ్రీ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్యదీక్షితులుగారు 1939 నుంచి సంస్కృతాంధ్ర అధ్యాపకులుగా పరిచయము. వారు ఆంధ్రీకరించి ప్రచురించిన పుస్తకములు నాకు బహూకరించేవారు. ఈ విధముగా వారు నాకు నారాయణీయము, గురుకృపాలహరి వగైరా పుస్తకములు ఇచ్చినారు. అందులో 'గురుకృపాలహరి'కి ఇంగ్లీషులో తర్జుమా చేసి కంచి పరమాచార్యులవారి శతసంవత్సర మహోత్సవమునకు వారితో కలసి వెళ్ళి స్వామివారికి సమర్పించినాను.

దీక్షితులుగారు పరమపదించటకు కొద్దిరోజుల ముందు శంకరాచార్యులవారు రచించిన 'ప్రబోధసుధాకరము' అనే గ్రంథమును తాము ఆంధ్రీకరించి ముద్రించిన ప్రతిని నాకు చూడమని ఇచ్చినారు. అందులో ముద్రారాక్షసములు మిక్కిలిగా ఉన్న సంగతిని వారి దృష్టికి తెచ్చితిని. అలాగే కొన్నిచోట్ల అనువాదమునకు మరిన్ని మెరుగులు దిద్దగల అవకాశమును వారితో చర్చించితిని. వారు ఆమోదించినారు. కానీ వారు జీవితకాలములో ఈ ప్రయత్నము పూర్తి అయి పుస్తకము పునర్ముద్రణము కాలేదు. ఈ మధ్యకాలములో ఈ గ్రంథ ప్రాశస్త్యము తెలుగు రానివారికి తెలియపరచడానికి నేను ఇంగ్లీషులోకి అనువదించి ప్రచురించినాను.

దీక్షితులుగారు అంగీకరించిన విధముగా తెలుగు ప్రబోధసుధాకరమును పరిష్కరించి ఇప్పుడు ప్రచురించుచున్నాను. ఆయా శ్లోక, పద్యములకు నేను వ్యాఖ్యానము, తాత్పర్యము వ్రాసినాను. సహృదయులు అందరూ ఈ నా ప్రయత్నమును ఆమోదించి కృష్ణభక్తి రసాయనమును ఆస్వాదించెదరుగాక యని యాశించుచున్నాను. ఈ పునర్ముద్రణము దీక్షితులవారికి ఆత్మానందము నీయ గలదనియు విశ్వసించుచున్నాను. ఈ ప్రయత్నమును అభినందించుచూ అమూల్యమైన అభిప్రాయమును ఒసగిన ప్రసిద్ధ సంస్కృత విద్వాంసులు, కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠ విశ్రాంత ప్రధానాచార్యులు బ్రహ్మశ్రీ దోర్బల ప్రభాకరశర్మ మహోదయులకు కృతజ్ఞుడను.

దేవళరాజు శ్రీమహావిష్ణు
బెంగళూరు

10-4-2012

# విషయసూచిక

# 1
# దేహనిందా ప్రకరణము

1. నిత్యానన్దైకరసం, సచ్చిన్మాత్రం స్వయంజ్యోతిః
   పురుషోత్తమ మజమీశం వందే శ్రీయాదవాధీశమ్

**వన్దన మొనర్తు నిత్యమానందరసము, సత్యము చిదేకరూపము స్వయమెజ్యోతి**
**ఈశమభవమ్ము, యాదవాధీశమగుచు పరగు పురుషోత్తమాఖ్యంబు బ్రహ్మమునకు**

నిత్యమైన ఆనందము యొక్క అనుభవమే స్వరూపమైనవాడు; సత్, చిత్ అనగా ఉనికి, తెలివి – ఈ రెండే తన స్వరూపమైనవాడు, తానే జ్యోతిస్వరూపమై తనకు తానే తెలియబడేవాడు, పురుషోత్తముడైనవాడు, అనగా శరీరమువల్ల తెలియబడే పురుషునికంటె శరీరములో శయనించినట్లు తెలియబడే జీవుడైన పురుషుని కంటె పైస్థాయిలోనున్నవాడు, సృష్టికి పూర్వమే ఉన్నందున పుట్టుకయే లేనివాడు, సమస్త చరాచర జగత్తును, దేవమనుష్య తిర్యక్ జాతులను శాసించే ఈశ్వరుడు, అట్టి పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీకృష్ణునికి, యదువంశమునకు అధిపతియైనవానికి నమస్కరిస్తున్నాను.

2. యం వర్ణయితుం సాక్షాత్ శ్రుతిరపి మూకేవ మౌనమాచరతి
   సోఽ స్మాకం మనుజానాం కిం వాచాం గోచరో భవతి

**యేని గొనియాడుచో శ్రుతియేని మూగదాని పోలిక మూగనోమూనుచుండు**
**అట్టి పరమాత్మ గోచరుండగునె, మనుజమాత్రులయినట్టి మనమాదు మాటలందు**

తాత్పర్యము స్పష్టము

3. యద్యప్యేవం విదితం తథాపి పరిభాషితో భవేదేవ
అధ్యాత్మశాస్త్రసారైః హరిచిన్తనకీర్తనాభ్యాసైః

**ఇది తెలిసినదే యైనను, వదలక నధ్యాత్మశాస్త్ర పరిశీలనతో**
**మది చింతనమలవడగా, సదయున్ కీర్తింపవచ్చు సంతతము హరిన్**

4. క్లప్తైర్బహుభిరుపాయైరభ్యాసజ్ఞానభక్త్యాద్యైః
పుంసో వినా విరాగం ముక్తే రధికారితా న స్యాత్

**భక్తి జ్ఞానము మంచి యభ్యాసమనగ, చక్కనైన యుపాయముల్ సాలగలుగు**
**గాక, చిత్తంబులో విరాగం బొకింత, కలుగదా – ముక్తికధికారి కాడతండు.**

భక్తియనగా భగవంతుడు. నిరంతరమూ హృదయములో సన్నిహితుడై ఉన్నాడనే నిశ్చయముతో ప్రవర్తనము. జ్ఞానమనగా సమస్త ప్రాణులలోను పరమాత్మ జీవరూపంగా సమానంగా వ్యాపించి ఉన్నాడని తెలిసి ప్రవర్తించడము. అభ్యాసమనగా చిత్తవృత్తి నిరోధముతో గూడిన యోగసాధనము. ఇట్టి ఉపాయములు ఎన్నో ఉన్నా కాని, బ్రహ్మ సత్యం, జగన్మిథ్య అనే దృఢభావనతో కూడిన విరాగము కలిగి, నశ్వరమైన జగత్తులో కోరికలు పెంచుకోవడం మానుకుంటేగాని, ఏ మనుష్యుడూ, జన్మమృత్యు పరంపరాస్వరూపమైన సంసృతి చక్రమునుండి విముక్తి పొందడానికి అధికారం పొందడు.

5. వైరాగ్యమాత్మబోధో భక్తిశ్చేతి త్రయం గదితమ్
ముక్తేః సాధన మాదౌ తత్ర విరాగో వితృష్ణతా ప్రోక్తా

**తనరు వైరాగ్యమాత్మబోధమును భక్తి, యనగ నిమ్మూడు సాధనము, లిందు**
**మొదటిది విరాగమన నెట్టి భోగమందు లేశమేనియు కోరిక లేక యునికి.**

ముక్తికి సాధనములు మూడుగా చెప్పబడినవి. అవి వైరాగ్యము, ఆత్మజ్ఞానము, భక్తి. యీ మొదటిదైన వైరాగ్యమనగా వితృష్ణత, అనగా నశ్వరమై, ప్రారబ్ధమునకు అధీనములైన సుఖముల కొరకు తహతహ లేకయుండుట.

6. సా చాహంమమతాభ్యాం ప్రచ్ఛన్నా సర్వదేహేషు
తత్రాహంతా దేహే మమతా భార్యాదివిషయేషు

ఆశ ప్రచ్ఛన్నమై యుండు నన్ని దేహముల నహంతలో మమతలో, నల యహంత తనువు నేనంట; మమత యీ దారసుతులు, విషయములు నావని పేర్మిగొనుట

ప్రతి మనుజునికి అంతర్యములో అహంత, మమత ఉంటాయి. ఈ భావములలో ఆశ ప్రచ్ఛన్నంగా ఉంటుంది. అహంత అంటే ఈ దేహమే నేననే భావన. మమత అంటే ఈ భార్యా, పుత్రులు, విషయములు నా స్వంతం అనే భావన.

7. దేహః కి మాత్మకోఽ యం కః సంబన్ధోఽ స్య వా విషయైః
 ఏవం విచార్యమాణేఽ హంతామమతా నివర్తేతే

**ఈ శరీరమ్ము తానాత్మకెట్టి రూప? మిది విషయముల సంబంధ మెనయునెట్టు లని విచారణ చేసినయంత దొలగి, పోవు నేనన్న నాదన్న భావమెల్ల**

ఈ శరీరము నా స్వరూపమనే భావము ఎందుకు వచ్చినది? నేను చూస్తూ ఉండగానే ఈ శరీరము బాల్య, యౌవన, వార్ధక్యదశలు అనుభవిస్తోంది. ఏ విషయమూ ఈ శరీరానికి ఎల్లప్పుడు సంతోషము కలిగించదు. కాలము ఈ శరీరానికి విషయాలకి ఉన్న సంబంధాలని మార్చివేస్తోంది అని విచారించితే నేను శరీరాన్ని కానని తెలుస్తుంది. అట్లాగే ఈ విషయములు నావి అనుకోవడం భ్రమయేనని తెలుస్తుంది. ఎందుకంటే ఈ భార్యపుత్రులు నావారని నేననుకున్నట్లే, వారు కూడా నేను తమకు చెందినట్లు భావిస్తారు. నావల్ల వారికి కలిగే ప్రయోజనమూ, వారివల్ల నాకు కలిగే ప్రయోజనమూ. ఈ రెంటికీ సమన్వయం కాలమే మార్చివేస్తుంది.

8. స్త్రీపుంసోః సంయోగాత్ సంపాతే శుక్రశోణితయోః
 ప్రవిశన్ జీవః శనకైః స్వకర్మణా దేహమాధత్తే

**స్త్రీయు, పురుషుడు కలిసిన స్థితిని, కలయు శుక్రశోణితములలోన జొచ్చి జీవు డల్లనల్లన పూర్వకర్మానుసార, మీ శరీరము తానేర్పరించుకొనును.**

తాత్పర్యము స్పష్టము

9. మాతృగురూదరదర్యాం కఫమూత్ర పురీష పూర్ణాయామ్
 జఠరాగ్నిజ్వాలాభిః నవమాసం పచ్యతే జన్తుః

తల్లి కడుపన్న పెనుగొంది నల్ల నిరికి, ప్రబల మూత్రపురీష కఫప్రవృద్ధి
గుమిలి జఠరాగ్ని కీలల కమరి కమరి, యుడికి జీవుడు నవమాస ముద్దుగుడుచు

తాత్పర్యము స్పష్టము

10. దైవాత్ ప్రసూతిసమయే, శిశుస్తిరశ్చీనతాం యదాయాతి
శస్త్రాత్ విఖండ్య స తదా బహిరిహ నిష్కాస్యతేఽతిబలాత్

వెడలు సమయాన నొకవేళ విధివశాన పిండమదియడ్డు తిరిగెనా ఖండఖండ
ములుగ నరకంగబడి శస్త్రములను వెలికి బలిమి నీడ్వంగబడు బాధ తెలుపవశమె

తాత్పర్యము స్పష్టము

11. అథవా యన్త్రచ్ఛిద్రాత్ యదా తు నిఃసార్యతే ప్రబలైః
ప్రసవసమీరైశ్చ తదా యః క్లేశః సోఽప్యనిర్వాచ్యః

కాక సహజ ప్రసూతి నా క్రంతనుండి, తానె తీవ్రప్రసూతి వాతముల చేత
నెట్టబడునేని వెలికి నా పట్టునందు, కలుగు కష్టమ్ము మాటల దెలుపరాదు

తాత్పర్యము స్పష్టము

12. ఆధివ్యాధివియోగాత్మీయవిపత్కలహదీర్ఘదారిద్ర్యైః
జన్మానన్తరమపి యః క్లేశః కింశక్యతే వక్తుమ్

వ్యాధు లా మీదటన్ మనోవ్యాధు లాప్తజన వియోగంబు, చావులు జగడములును
లేమి దరిలేని క్లేశంబు భూమిమీద పడిన యా మీద నదిగూడ నుడవదరమె

తాత్పర్యము స్పష్టము

13. నరపశువిహఙ్గ తిర్యగ్యోనీనాం చతురశీతి లక్షాణామ్
కర్మనిబద్ధో జీవః పరిభ్రమన్యాతనాం భుఙ్క్తే

నరపశు విహంగ తిర్యక్కులరయ జీవు, లెలమి నెనుబదినాల్గు లక్షల విధాలు
జీవయోనుల జీవుండు చిక్కి చిక్కి, కర్మబంధాల రాకపోకల నొనర్చు
నంతుదరిలేని యాతనలనుభవించు, తనువు విషయమ్ములవి నేను నా వటంచు

ఈ సృష్టిలో ఎనుబది నాలుగు లక్షల జీవరాశులున్నవి. ప్రతి జీవజాతికి సంఖ్య అనంతంగా ఉన్నది. ప్రతి జీవి పుట్టుకకు ఆ జీవి పూర్వకర్మవాసనలే కారణము. పుట్టిన తరువాత ఈ తనువు నాది, ఈ విషయాలు నావి అని పూనికతో కామ్య కర్మములు చేస్తూ ఈ వాసనలు వృద్ధిజేసుకుంటాడు. తిర్యక్ యోనులలో అనుభవమే కాని ఆలోచన ఉండదు. మనుష్యులైతేనే ఈ వాసనలు పోగొట్టుకునే ప్రయత్నం చేయగలడు. ఇవన్నీ యాతనలే.

14. చరమస్తత్ర నృదేహః తత్రోఽజన్మాన్వయోత్పత్తిః
స్వకులాచారవిచారః శ్రుతిప్రచారశ్చ తత్రాపి

**అన్నిటికి మీద నరదేహ మందు మీది, దరయ ద్విజజన్మ ముత్తమమ్మందులోన**
**నిజకులాచార సువిచారనిరతి యందులోన కడుమిన్న వేదవిజ్ఞానయుక్తి**

నరదేహ జన్మమే, తిర్యక్‌జాతిలో పుట్టుటకంటే మేలు. దేవతాజన్మ కంటే నరజన్మ ఎందుకు మేలు అంటే దేవతాజన్మలో పుణ్యానుభవమే కాని, పుణ్యకర్మములకుగాని, మోక్ష విచారమునకుగాని అవకాశము కలుగదు. ఈ నరజన్మములో ఉత్తమకులములో జన్మించుట శ్రేష్ఠము. అటుపిమ్మట నా ఉత్తమ కులాచారమును ఆదరించి ఆచరించుట. ఇంకా పైస్థాయి జన్మలో వేదవిజ్ఞానపారీణత శ్రేయోదాయకము.

15. ఆత్మానాత్మవివేకో నో దేహస్యావినాశితా జ్ఞానమ్
ఏవం సతి స్వమాయుః ప్రాజ్ఞైరపి నీయతే మిథ్యా

**అంతకును మిన్న ఆత్మ యనాత్మ భేద మెఱుగు టీ మేను నశియించు టెఱుగుటయును**
**సారమిట్లుండ నెఱుకగన్నారు కూడ నకట! వృథసేయుదురు తమ యాయువెల్ల**

నరజన్మమును, ఉత్తమ కులాచారమును సంప్రాప్తించి, వేదవిజ్ఞానము నెఱింగి, ఆత్మానాత్మ వివేకము పొంది, దేహ నశ్వరత్వము తెలిసికొని ఇంతటి ఉత్తమ జన్మములో, విద్వాంసులు కూడా, తమ ఆయువును ఆత్మప్రాప్తికి వినియోగింపక, లోకమందలి కీర్తిప్రతిష్ఠలకు, ధనధాన్య సంపదలకు వినియోగించుట శోచనీయము.

16. ఆయుః క్షణలవమాత్రం నలభ్యతే హేమకోటిభిర్వాపి
తత్ చేత్ గచ్ఛతి సర్వం మృషా, తతః కాఽధికా హానిః

**ఆయువొక క్షణమైన దుర్వ్యయము చేయ, మరల దొరకదు కోటి హేమమ్ములీయ**
**అది గతించిన లోకమే యనృతమౌను., అంతకంటెను మించిన హాని కలదె?**

తాత్పర్యము స్పష్టము

17. నరదేహాతిక్రమణాత్ ప్రాప్తౌ పశ్వాదిదేహానామ్
స్వతనోరవ్యజ్ఞానే పరమార్థస్యాత్ర కా వార్తా

అకట నరజన్మ మెదలి పశ్వాది దేహ మూనెనేనియు తనయొడల్ తానె యెఱుగ
నట్టి యాదశలో, పరమార్థమట్టె తెలిసికొనుమాట కలనైన తలపరాదు.

తాత్పర్యము స్పష్టము

18. సతతం ప్రవాహ్యమానైః వృషభై రశ్వైః ఖరైర్గజైర్మహిషైః
హా కష్టం క్షుత్క్షామైః శ్రాన్తైర్నో శక్యతే వక్తుమ్

ఎపుడు బరువెత్తి పరుగులెత్తింపబడెడు నెద్దు, గుఱ్ఱాలు, గాడిద, లేన్గు దున్న
యకట! ఆకలి కరువుల నార్తిజెందు పాటులిట్టిట్టివని చెప్ప వశము కాదు

తాత్పర్యము స్పష్టము

19. రుధిరత్రిధాతుమజ్జామేదోమాంసాస్థి సంహతిర్దేహః
స బహిస్త్వచా పినద్ధస్తస్మాన్నో భక్ష్యతే కాకైః

అరయ కఫ వాత పిత్తమజ్జాస్థి రక్త, మాంస మేదోర్థ సంకులమ్మీ శరీర
మునకు పైతోలు కప్పుటన్ నలుప కరుణ, కాకులకు పీకి తిన వీలు కాకయుండు

తాత్పర్యము స్పష్టము

20. నాసాగ్రాద్వదనాద్వా కఫం మలం పాయుతో విసృజన్
స్వయమేవైతి జుగుప్సాం అంతః ప్రసృతం చ నో వేత్తి

ముక్కునను నోట శ్లేష్మంబు ముడ్డి మలము నెడల తనుదాన నరు డసహ్యించుకొనును
గాని తనలోని కుళ్లను తానెఱుంగ జాలడిది సర్వమానవ సహజవృత్తి

తాత్పర్యము స్పష్టము

21. పథి పతితమస్థి దృష్ట్వా స్పర్శభయా దన్యమార్గతో యాతి
నో పశ్యతి నిజదేహం చాస్థిసహస్రావృతం పరితః

ఏమ్ముగని దోవలోన కాలెత్తి యెత్తి, వేయు నెక్కడ దాకునో వ్రేలి కనుచు
గాన నేరదు తన మేనిలోన వేలు వేలుగా నున్న బొమికల విధము నరుడు

తాత్పర్యము స్పష్టము

22. కేశావధినఖరాగ్రాత్ ఇదమన్తః పూతిగన్ధసంపూర్ణమ్
బహిరపి చాగరుచన్దనకర్పూరాద్యైర్విలేపయతి

ఆనఖశిఖంబు పాదుకంపంతరమున నిండియుండును. వెలుపలన్ దెలియు నొదలి కగరుగంధంబు కర్పూరమలది యలది, గర్వపడునీట మాటికిన్ కడిగి కడిగి

తాత్పర్యము స్పష్టము

23. యత్నాదస్య పిధత్తే స్వాభావికదోషసంఘాతమ్
ఔపాధికగుణనివహం ప్రకాశయన్ శ్లాఘతే మూఢః

కడిగి నైజంబు దోషంబు కప్పిపుచ్చు, వెలికి నౌపాధికగుణంబ వెల్లడించు
మూఢుడెంతేని తనుదాన పొగడుకొనును, ముచ్చటను గొను తనలోన మురిసిపోవు

తాత్పర్యము: స్పష్టము

24. క్షతముత్పన్నం దేహే యది న ప్రక్షాల్యతే త్రిదినమ్
తత్రోత్పతన్తి బహవః కృమయో దుర్గన్ధసంకీర్ణాః

నలుకువడ మేనఁ బుండౌను నరుడు దాని కడుగకుండిన మూణ్ణాళ్లు కంపుగొట్టు
పురుగులోడును దుర్గంధ భరితములుగ, నరుని యీ మేని అందచందంబులింతె

తాత్పర్యము స్పష్టము

25. యో దేహః సుప్తోఽభూత్ సుపుష్పశయ్యోపశోభితే తల్పే
సంప్రతి స రజ్జుకాష్ఠైః నియన్త్రితః క్షిప్యతే వహ్నౌ

తనువహో! హంసతూలికా తల్పమందు, పూలపాన్పునఁ బవళించె బూర్వమేది
అదియె తాళ్లను కట్టెలనంటగట్టి, వేగ నక్కాటిలో నగ్గి విసరబడును.

తాత్పర్యము స్పష్టము

26. సింహాసనోపవిష్టం దృష్ట్వా యం ముదమవాప లోకోఽ యమ్
తం కాలాకృష్ట తనుం విలోక్య నేత్రే నిమీలయతి

ముస్ను సింహాసనంబునందున్న యేని, గాంచి యానందపడెనొ లోకంబు వాని
గాలుచే నీడ్వబడిన మేన్గలుగువాని, నదియె లోకంబు గని కనులట్టి మూయు.

తాత్పర్యము స్పష్టము

27. ఏవం విధోఽపి మలినో దేహో యత్ సత్తయా చలతి
తం విస్మృత్య పరేశం వహత్యహన్తామనిత్యేఽ స్మిన్

ఈ విధంబున దుష్టమౌ నీ శరీర, మేని యునికినిఁ జేష్టించువాని మఱచి
యు పురాత్పరు, ని య్యనిత్యంబు పాడు, కట్టెపైని నరుం డహంకారమూను

తాత్పర్యము స్పష్టము

28. క్వాఽ త్మా సచ్చిద్రూపః క్వమాంసరుధిరాస్థినిర్మితో దేహః
ఇతికథంయో సజ్జతి ధీమా నితరశరీరం మనుతే

అదిర సచ్చిత్స్వరూప మయ్యాత్మ యేడ? రక్తమాంసాస్థిమయ శరీ రమ్మిదేడ
అని తలంచిన ధీశాలి యట్టె యితర దేహమును గణించునె మహోత్కృష్టమైన

పరమాత్మయే ప్రతి ప్రాణికి ఈ శరీరమే నేననే భ్రాన్తితో, ఎప్పుడూ తెలియ బడుతూ ఉంటాడు. ఆ భ్రాన్తికే అహంకారమనే పేరు. ఉనికి, తెలివి ప్రతి ప్రాణికి అహంకారం ద్వారా తెలియబడుతూ ఉంటుంది. ఉనికి, తెలివి శాశ్వతస్వరూపమైన ఆత్మకే వర్తిస్తాయి. ఏ అహంకారం వల్ల ప్రాణి ఈ దేహానికే ఉనికినీ, తెలివినీ ఆపాదించు కుంటుందో, అది వట్టి మిథ్య. ఎందుకంటే శాశ్వతమైన ఆత్మయొక్క స్వరూపము, బాల్య, యౌవన, వార్ధక్యావస్థలు పొందుతూ ఉన్న శరీరానికి ఆపాదించుకోవడం మూర్ఖత్వమే ఔతుంది. అన్ని శరీరాలలోనూ ఉన్నది పరమాత్మయే గనుక, ఏ శరీరంలోనైనా అహంకారం మిథ్యయే. అయినా ప్రపంచంలో అన్ని వ్యవహారాలు జీవుని అహంకారం వల్లనే నిర్వర్తింపబడుతున్నాయి. ఏ శరీరమైనా పరమాత్మవల్లనే చైతన్యం పొందుతూ ఉంటుంది.

# 2

# విషయనిందా ప్రకరణము

29. మూఢః కురుతే విషయజకర్దమసంమార్జనం మిథ్యా
దురదృష్టవృష్టివిరసో దేహో గేహం పతత్యేవ

జడుడు భోగములను మట్టియడుసు పూసి, దేహము యింటి కందమందించగోరు
అవల నా పూత దౌర్భాగ్యమనెడు వాన గురిసి తెగనాని యా కొంప కూలిపోవు

మూర్ఖుడైన మానవుడు, తన దేహానికి సుఖం కలిగిస్తాయి అనుకునే విషయాలు సంపాదించుకుంటాడు. ఈ దేహంకాని, విషయాలు కాని తాత్కాలికంగానే సుఖాలు చేకూరుస్తాయి. ఎట్లాగంటే మట్టితో ఇటుకలు పేర్చి, మళ్లీ మట్టిపూతతోనే గోడను నిలబెట్టినట్లు. ఒక్క వానతో ఆ గోడ కూలిపోతుంది. విధి ప్రతికూలిస్తే ఆ దేహము అయినా పడిపోవచ్చు లేక తెచ్చుకున్న విషయములు భోగాన్ని కల్పించకపోవచ్చు. ఆత్మలో సుఖం చవిజూడవలెనుగాని, దేహంవల్ల, విషయాల వల్ల వచ్చే కొద్దిపాటి సుఖము, విధి వైపరీత్యమునకు లోబడియే ఉంటుంది. ఆ సుఖాన్ని కూడా ఆత్మయే సమకూరుస్తూ ఉంటుంది.

30. భార్యా రూపవిహీనా మనసః క్షోభాయ జాయతే పుంసామ్
అత్యన్తం రూపాఢ్యా సా పరపురుషైర్వశీక్రియతే

భార్య రూపము లేక క్షోభమ్మునిచ్చు, నామె యత్యంత రూపాఢ్యయైన, బరులు
వశము గొనజూతురది చాల బాధయగును, సొగసు కలిగిన లేకున్న వగపె మిగులు

తాత్పర్యము స్పష్టము

31. యః కశ్చిత్ పరపురుషో మిత్రం భృత్యోఽథవా భిక్షుః
    పశ్యతి హా సాభిలాషం విలక్షణోదారరూపవతీమ్

అతి విలక్షణ సౌందర్యవతియౌ భార్య, ఆమె నభిలాషతో కొందరైన జూతు
రటులె మిత్రుండొ, భృత్యుడో, విటవరుండొ, గుమ్మమున నిల్చి వేడు భిక్షుకుడు గూడ

తాత్పర్యము స్పష్టము

32. యా కంచిత్ పురుషవరం స్వభర్తురతిసున్దరం దృష్ట్వా
    మృగయతి కిం మృగాక్షీ మనసేవ పరస్త్రియం పురుషః

నారి తన భర్త కంటె సుందరుని పురుష వరుని కనుగొని మరులొంది పరవశించి
వెదకులాడదె? వానిని గదియు దారి, మగలు పరభామలన్ గని మరులు కొనరె?

తాత్పర్యము స్పష్టము

33. ఏవం సురూపనార్యా భర్తా కోపాత్ ప్రతిక్షణం క్షీణః
    నో లభతే సుఖలేశం బలిమివ బలిభుగ్గృహాన్వేకః

అందకత్తెను కట్టుకున్నాతడిట్లె, కోపమున ప్రతిక్షణమునున్ కుములుచుండు
లేశమైన సుఖమ్మొందలేడు కాక బలిని హరియించు బహు కాకముల నొకండు.

అందకత్తెను కట్టుకున్నాగాని, ఒకప్పుడు భర్త మానసిక క్షోభమువలన సుఖం పొందలేడు. ఎందుకనగా, తన భార్యయందు దృష్టి పదేపదే సారించు పురుషులపై కోపం పెంచుకుంటూ, పైకి ఏమీ అనలేక మనస్సులోనే ఉడికిపోతాడు. వాని పరిస్థితి ఎట్లాంటిది అంటే, ప్రేతబలి కాకులు తినడానికి వేస్తే, గుమికూడే కాకులన్నిటిలో తను కూడా ఒకడు అయినట్లు.

34. వనితా నితాన్త మాజ్ఞాముల్లఙ్ఘ్య వర్తతే యదిసా
    శత్రోరప్యధికతరా పరాభిలాషిణ్యసౌ కిముత

వాన గయ్యాళియై భర్త యాన మీరి, సంచరించిన మరివేర శత్రులెవరు?
మగని తెగువను గొని మారుమగని మరిగి, యొగచి తిరిగిన చెప్పెడిదేమి యింక?

తాత్పర్యము స్పష్టము

35. లోకో నాపుత్రస్యాస్తీతి శ్రుత్యా ప్రభాషితో లోకః
ముక్తిః సంసరణం వా తదన్యలోకో-థవా నాద్యః

36. సర్వే-పి పుత్రభాజః తన్ముక్తౌ సంసృతిర్భవతి
శ్రవణాదయో-ప్యపాయా మృషాభవేయు స్తృతీయేపి

37. తత్రాప్యపాయసత్వాత్ ద్వితీయ పక్షే-స్య పుత్రస్య
పుత్రేష్ట్యాదికయాగప్రవృత్తయే వేదవాదో-యం

"నాస్తి లోకోప్యా పుత్రస్య" నా దనర్భు, శ్రుతి యపుత్రకునకు లేదు లోకమె యన వచట లోకము ముక్తియా యనుట యొకటి, కాదు సంసరణమ్మొ లోకమన అన్యలోకమ్మొ లోకమంచనుట మూడు, నందు మొదటిది కాదు పుత్రాఢ్యులెల్ల ము గనరెండు సంసారమున భ్రమింత్రు, మూడవది కాదు శ్రవణాది పుణ్యఫలము లేకపోవుట శ్రుతి యలీకమనుట, కనుక మిగులును సంసారమనెడిమాట. రూఢియగునిది, శ్రుతులు పుత్రుడు జనింప యాగము లొనర్పజేసెడి యర్థవాద మగుట, దైన్యము చెందుట యనవసరము.

శ్రుతి వాక్యమున్నది. అపుత్రకునకు లోకమే లేదని. ఇక్కడ లోకమనగా : ముక్తియా? కానేకాదు. కొడుకులున్నవాళ్లంతా ముక్తులగుతున్నారా? సంసార భ్రమిస్తున్నారు గాని. లోకమంటే పరలోకమా? శ్రవణాది పుణ్యప్రయత్నములకు లోకంలో ప్రయోజనం లేదంటే శ్రుతి అబద్ధమౌతుంది. కొడుకులు లేనంత మాత్రః స్వర్గము ప్రాప్తించదనుట శ్రుతి విరుద్ధము. ఇక లోకమంటే సంసారమా? అదే లోకః మాటకు అర్థము. ఎందుకంటే పుత్రులు లేనివారికి సంసారంలో సౌఖ్యం లేదని చెప్ప శ్రుతి ప్రోత్సహిస్తోంది, పుత్రకామేష్టి వంటి యాగములు చేసి పుత్రవాంఛ తీర్చుకోవ

38. నానా శరీరకష్టై ర్ధనవ్యయైస్సాధ్యతే పుత్రః
తస్మిన్ ఉత్పన్నమాత్రే జీవితచిన్తా గరీయసీ తత్ర

పలు వ్యయప్రయాసముల గల్గు సుతు డింక దిగులు వాని బ్రతుకు తెలుపు గు

తాత్పర్యము స్పష్టము

39. జీవన్నపి కిం మూర్ఖః కింవా సుశీలభాగ్ భవితా
జారశ్చోరః పిశునః పతితో ద్యూతప్రియః క్రూరః

బ్రతుకుగాక వాడు ప్రాజ్ఞుడో, మూర్ఖుడో, శిష్టుడగునొ మిగుల దుష్టుడగునొ

తాత్పర్యము స్పష్టము

40. పితృమాతృబన్ధు ఘాతీ మనసః ఖేదాయ జాయతే పుత్రః
చిన్తయతి తాతనిధనం పుత్రో ద్రవ్యాద్యధీశతాహేతోః

క్రూర, చోర, పిశున, జారత్వ పతితుడో, మాతృ పితృ కుటుంబ ఘాతకుండొ
ధనిక జనక నిధన తత్పరమతియైన, జారడైన మిగుల ఖేదమగును
కొడుకు పుట్టెననుచు కులుకుట సరిగాదు, చాల వెతల గూర్పజాలు సుతుడు

తాత్పర్యము స్పష్టము

41. సర్వగుణైరుపపన్నః పుత్రః కస్యాపి కుత్రచిత్ భవతి
సోఽల్పాయురుగ్రో వాఽ ప్యనపత్యో వా తథాఽ పి ఖేదాయ

అన్ని యోగ్యతలకు నాటపట్టగునట్టి, కొడుకు కలుగుటెంతొ కడిది జగతి
పుట్టుగాక వాడపూర్ణాయు వనపత్యుడైన రోగియైన నదియు బాధ

తాత్పర్యము స్పష్టము

42. పుత్రాత్ సద్గతిరితి చేత్ తదపి ప్రాయోఽ స్త్యయుక్తిసహమ్
ఇత్థం శరీరకష్టైర్దుఃఖం సంప్రాప్యతే మూఢైః

సుతుని వలన మంచి గతి కల్గునన యుక్తి సహము కాదు; సుతుడు జనకపుణ్య
పాపసంచయమును మాపు చేయగలేదు, మూఢుడిటులె కష్టముల వరించు

తాత్పర్యము స్పష్టము

43. పితృమాతృబన్ధుభగినీపితృవ్యజామాతృముఖ్యానామ్
మార్గస్థానామివ యుతిరనేకయోనిభ్రమణవశాత్ క్షణికం

తల్లిదండ్రు లన్నసెల్లెలు పినపెద్ద తండ్రు లల్లుడన్న వాండ్ర పొత్తు
బహుళ యోనులందు భ్రమణంబులవి పాంథ జనుల యుతిని బోలు, క్షణికములవి

తల్లిదండ్రులు, అన్నచెల్లెళ్లు, పినతండ్రులు, పెదతండ్రులు, అల్లుళ్లు – వీరందరితో

కలయిక ఎప్పుడైనా కొంతకాలము వరకే. ఎందుకంటే, ప్రతివారు అనేక గర్భములలో వాసము చేస్తూనే ఉన్నందున, అనంతకాలమునుంచీ; యిప్పటి సంబంధముల కాలము అనంతకాలముతో పోల్చుకుంటే క్షణికములనే భావించాలి. ఇవన్నీ మార్గంలో తారసపడేవారితో కలిగే సంబంధము వంటివే.

44. ద్రైవం యావత్ విపులం యావత్ ప్రచురః పరోపకారశ్చ
తావత్ సర్వే సుహృదో, వ్యత్యయతః శత్రవః సర్వే

ఎంతవర కదృష్టవంతుడో యుపకారవంతు డెంతవరకొ, యంతవరకు
నందరాప్తులౌదు రది తారుమారైన నంతమంది శత్రులౌట నిజము

తాత్పర్యము స్పష్టము

45. అశ్నన్తిచే దనుదినం వన్దిన ఇవ వర్ణయన్తి సంతృప్తాః
తత్ చేత్ ద్విత్రిదినాన్తరమభినిన్దన్తః ప్రకుప్యన్తి

కుడువబెట్టిన యెన్నాళ్లు గుడిచి తృప్తి బడసి కీర్తింతురందరున్ భట్టులట్లు
పెట్టుదెడమైన మూణ్ణాళ్లు, తిట్టిపోతు, రట్టి కోపింతు రెల్లరీ చుట్టములును

తాత్పర్యము స్పష్టము

46. కుర్పర జఠర నిమిత్తం సముపార్జయితుం ప్రవర్తతే చిత్తమ్
లక్షావధి బహు విత్తం తథాప్య లభ్యం కపర్దికామాత్రమ్

పొట్టపోసికొనుట కట్టె చిత్తము పూను, ధనము తెచ్చుపనికి తత్పరతను
లక్షలందుకొనుట లక్ష్యమేయైనను చిల్లిగవ్వయైన చేర్చలేదు

తాత్పర్యము స్పష్టము

47. లబ్ధశ్చేత్ అధికోఽ ర్థః పత్న్యాదీనాం భవేత్ స్వార్థః
నృపచోరతోఽ ప్యనర్థః తస్మాద్ ద్రవ్యేర్ధ్యమో వ్యర్థః

అర్థలబ్ధి చాల నధికమే యైనను, స్వార్థలాభమగును భార్య సుతుల
కర్థమపహరింతు రవనీపులును చోరు లగును ధనమనీష వ్యర్థమిటులె

ధనము ఎక్కువగా సంపాదిస్తే, అందులో ఎక్కువ భాగము భార్యాపుత్రుల సంతోషమునకు వినియోగపడుతుంది. రాజులు ధనాఢ్యుల నుండి ధనము గుంజుకుంటారు. లేకపోతే దొంగలు అపహరిస్తారు. ధనము గురించిన తాపత్రయము ఈ విధంగా వ్యర్థమైపోతుంది.

48. అన్యాయమర్థభాజం పశ్యతి భూపోఽ ప్యగామినం చోరః
    పిశునో వ్యసనప్రాప్తిం దాయాదానాం గణః కలహమ్

రాజు హరియించు నన్యాయ లబ్ధవిత్త, మది హరింతురు త్రోవలన్ గదిసి దొంగ
లెన్నలుబ్ధులు గడియింతురెన్నొ వెతలు, కలహమందింత్రు దాయాద గణము భువిని

తాత్పర్యము స్పష్టము

49. పాతకభరైరనేకైరర్థం సముపార్జయన్తి రాజానః
    అశ్వమతంగజహేతోః ప్రతిక్షణం నాశ్యతే సోఽ ర్థః

పాతకములెన్నొ భరియింత్రు పార్థివులును, ధనము సమకూర్చుకొనువేళ ధర్మమెడలి
అనుక్షణంబును నీ ధనమరిగిపోవు అశ్వమాతంగ పోషణ వ్యయముకతన

తాత్పర్యము స్పష్టము

50. రాజ్యాన్తరాభిగమనాత్ రణభఙ్గాత్ మన్త్రిభృత్య దోషాద్ వా
    విషశస్త్రభృత్యఘాతాత్ మగ్నాశ్చిన్తార్ణవే భూపాః

పొరుగు రాజ్యాల కబళింప నరుగుచుండి, యుద్ధభూమిని పగతురకోడిపోయి
సచివసేవక వైఫల్య శంకనంది, భృత్య విషశస్త్ర ఘాతంపు భీతిజెంది
నృపతి మునుగును చింతలన్ నిదురలేక

తాత్పర్యము స్పష్టము

# 3

# మనోనిందా ప్రకరణము

51. హసతి కదాచిత్ రౌతి భ్రాన్తం సత్ దశదిశం భ్రమతి
హృష్టం కదాపి దుష్టం శిష్టం చ నిందతి స్తౌతి

**నవ్వు నొకట నేడ్చు, నలుదిక్కులన పర్వులెట్టు భ్రమను జెందు గట్టి తృప్తి**
**శిష్ట దుష్ట భేద చింతనామూఢమై, పొగడు, దెగడు, మిగుల వగలకుందు**

ఈ మనస్సు అత్యంత చంచలము. ఒకసారి నవ్వుతూ ఉల్లాసంగా ఉంటుంది. మరొకసారి దుఃఖంతో ఏడుస్తుంది. ఒక భావంలో స్థిరంగా ఉండక పరి పరివిధాల భావాలతో పరుగులు పెట్టుంది. భ్రాన్తికి లోబడి చంచలమైపోతుంది. ఒకసారి తృప్తిగా సంతోషిస్తుంది. ఇంకొకసారి దుష్టంగా తయారవుతుంది. మరొకసారి శిష్టాచారమును ఆదరిస్తుంది. ఒకప్పుడు పొగడుతుంది. ఒకప్పుడు నిందిస్తుంది.

52. కిమపి ద్వేష్టి సరోషం హ్యాత్మానం శ్లాఘతే కదాచిద్ అపి
చిత్తం పిశాచమభవద్రాక్షస్యా తృష్ణయా వ్యాప్తమ్

**ఎందునైన రోషమంది ద్వేషించును, తనను తానె పొగడుకొను నొకప్పు**
**డాశయనెడు రాక్షసావేశమున చిత్త మాడు నొక పిశాచమాడినట్లు**

ఏదో విషయంలో ద్వేషం పెంచుకుని కోపిస్తుంది. ఒక్కొక్కసారి తనను తానే పొగడుకుంటుంది. తృష్ణ అనే రాక్షసి ఆవేశిస్తే, ఒక పిశాచంలాగా మంచిచెడ్డలు తెలియకుండా సంకల్ప, వికల్పాలు చేస్తుంది.

53. దమ్భాభిమానలోభైః కామక్రోధమదమత్సరైః చేతః
ఆకృష్యతే సమన్తాత్ శ్వభిరివ పతితాస్థివత్ మార్గే

కుక్కలెముకనట్లు కోపంబు కామంబు మదము లోభమోహమత్సరములు
బుద్ధినీడ్చు లాగు బొరలించు దొరలించు, పలు వికారముల పాలు చేయు.

కుక్కకు దారిలో ఎముక దొరికితే ఆడుకున్నట్లు యీ బుద్ధిని అతని శత్రువులైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు రకరకాలుగా వికారములకు లోను చేస్తాయి.

54. తస్మాత్ శుద్ధవిరాగో మనో-భిలషితం త్యజేదర్థమ్
త దనభిలషితం కుర్యాత్ నిర్వ్యాపారం తతో భవతి

అందువలన నచ్చమగు విరాగము పూని మనసు మనసుపడిన పనిని మాని
మనసు మానుమన్న పనిచేయవలె, దాన చేష్టలుడిగి మనసు స్థిరత్త జెందు

మనస్సు పలు వికారములకు కారణమైనందున మనస్సును గట్టిగా నియమించాలి. అందుకు మార్గము ఏమిటంటే, మనసు తనంత తాను ఏ పనికి ఉత్సాహపడుతుందో, ఆ పనిని మానివేసి మనస్సు వెనుకడుగు వేసే పనినే పూనుకొని చేయాలి. అప్పుడే మనస్సు స్వతంత్రమైన పరుగులు మాని, నియమానికి లోబడుతుంది.

# 4

# విషయనిగ్రహ ప్రకరణము

55. సంసృతిపారావారే హ్యగాధవిషయోదకేన సంపూర్ణే
నృశరీరమమ్బుతరణం కర్మసమీరైరితః తతః చలతి

56. ఛిద్రైర్నవభిరుపేతం జీవో నౌకాపతిర్మహానలసః
ఛిద్రాణామనిరోధాత్ జలపరిపూర్ణం పతత్యధః

57. ఛిద్రాణాం తు నిరోధాత్ సుఖేన పారం పరం యాతి
తస్మాదిన్ద్రియనిగ్రహమ్మృతే న కశ్చిత్ తరత్యసృతమ్

సంసారమిది మహాసాగరమ్ము నగాధవిషయోదకముల సంభృతినెసంగు
నరశరీరము దీని దరియింప నడిపింపబడునావ; కర్మలే వాయువులవి
కదిలించు నిట్టటుల్, కలవు దీనికి చిల్లు, లవి తొమ్మిదిగనుండు; నత్యలసుడు
జీవుడే దీనికి నావికు దీరన్ధ్రముల మూయకుండిన జలము నిండి

మునిగిపోవు నౌక, మొనసి చిల్లులగప్ప, నవలితీర మందు టతి సులభము
అందుచేత నింద్రియముల నిగ్రహమునన్, దక్క ననృత జలధి తరణమగునె?

సంసారము అంటే జీవుడు మళ్లీ మళ్లీ జన్మలు ఎత్తుతూ, మృత్యువు పాలవుతూ, మళ్లీ చర్విత చర్వణముగా ఇట్లా జన్మ పరంపరనుండి తప్పించుకోలేని పరిస్థితి. దీనికి అంతూ పొంతూ లేనందున దీనిని సముద్రముతో పోల్చినారు. ఈ సముద్రములోని నీరు ఇంద్రియములు కోరుకునే విషయములు. ఈ విషయములను అనుభవించడానికి చేసే కర్మలు అన్నీ జీవుణ్ణి వాసనలుగా ప్రతి జన్మలోనూ వెంబడించి, మనస్సును ఆ

విషయానుభవముల కోసమే తహతహలాడేటట్లు చేస్తాయి. ఈ కర్మ వాసనలే ఈ శరీరమనే నౌకను ఈ సంసారసాగరమునకు అవతలి ఒడ్డుకు చేరకుండా, ఈ సంసారంలోనే ఇటూ, అటూ ఆడిస్తూ ఉంటాయి. ఈ నావకు ఇంద్రియములనే చిల్లులు ఉన్నాయి. ఈ ఇంద్రియముల ద్వారా శరీరము విషయానుభవమును పరిగ్రహించినట్లు, ఈ చిల్లులద్వారా విషయములు అనే నీరు నౌకలోనికి ప్రవేశించి నౌక మునిగిపోతుంది. ఈ జీవుడు కామవాసనల చేత బంధితుడై, ఇంద్రియములను నిగ్రహించకుండా ఆ విషయానుభవములను పరిగ్రహిస్తూ ఉంటాడు గనుక అత్యలసుడు అనగా బద్ధకస్తుడు అని అన్నారు. అందుచేత కామవాసనలను తట్టుకుని, వానికి లోనుగాకుండా, ఇంద్రియములను నిగ్రహిస్తేనే ఈ నావ అవతలి ఒడ్డుకు చేరి, జీవుడికి నావతో అవసరం లేని ముక్తి వస్తుంది. లేకపోతే ఈ దేహం పడిపోతే, మరో దేహాన్ని కాలం ఏర్పాటుచేస్తూ ఉంటుంది కనుక, ఇంద్రియ నిగ్రహమే ముక్తిని సంపాదించుకోడానికి అతి ప్రధానమైన సాధనము.

58. పశ్యతి పరస్య యువతిం సకామమపి తన్మనోరథం కురుతే
- జ్ఞాత్వైవ తదప్రాప్తిం వ్యర్థం మనుజోఽ తిపాపభాగ్ భవతి

పరసతుల జూచు కామతత్పరత నట్టి, వారి రమియింప కోర్కెలబడి భ్రమించు
తనకు నందని దా సుఖమని యెరింగియును నెడందను పాపవాసనల బెంచు

తాత్పర్యము స్పష్టము

59. పిశునైః ప్రకామముదితాం పరస్యనిన్దాం శృణోతి కర్ణాభ్యామ్
తేన నరః కిం ప్రియతే; వ్యర్థం మనుజోఽ తి పాపభాగ్ భవతి

అతినికృష్టులు పూనికనంది పలుక, కెరలి పరనింద చెవులు నిక్కించి వినును
దాన పరుడేమి చచ్చునా? కాని నరుడు, కుడిచి కూర్చుండి పాపమున్ గుడుచుచుండు

తాత్పర్యము స్పష్టము

60. అన్నృతం పరాపవాదం రసనా వదతి ప్రతిక్షణం తేన
పరహానిర్లబ్ధిః కా? వ్యర్థం మనుజోఽ తి పాపభాగ్ భవతి

అన్నృతము పరాపవాదము నట్టి పలుకు, నాల్క యెల్లప్పుడును నాశనమ్ము దాన
కలదె పరునికి? తనకైన కలదె లబ్ధి వ్యర్థ మిటులనే నరుడు పాపము భుజించు

61. విషయేంద్రియనిర్యోగే నిమేషసమమేవ యత్సుఖం భవతి
విషయే నష్టే దుఃఖం యావజ్జీవం హి తత్ తయోర్మధ్యే

ఏ నిముసంబు నందు విషయేంద్రియ సంయుతి సంభవించునో
ఆ నిముసమ్ము మాత్రమె సుఖాప్తి యగున్ విషయేంద్రియంబులా
పైన వియుక్తి జెందుటను ప్రాప్తమగున్ పరితాప మిట్టులే
పూను శరీరధారి సుఖమున్ పరితాపము నాయువంతయున్
గానడు శాశ్వతంబగు సుఖంబు పరాత్మను విస్మరించుటన్

విషయేంద్రియసంయోగంలో క్షణికమైన సుఖము ఆ తరువాత విషయేంద్రియ వియోగము వలన పరితాపము, ఈ విధంగా జీవుడు ఆయువంతా విషయానుభవముల కొరకు, అంటే సుఖదుఃఖద్వన్ద్వముల కొరకు వెచ్చిస్తూనే ఉంటాడు. దుఃఖస్పర్శయే లేని ఆత్మానంద సౌఖ్యము కొరకు ప్రయత్నం చేయడు.

62. హేయముపాదేయంవా ప్రవిచార్య సునిశ్చితం తస్మాత్
అల్పసుఖత్యాగాత్ యద్యనల్ప దుఃఖం జహాతి సుధీః

తా విమర్శించుకొన నిశ్చితముగ దెలియు, హేయమెట్టి దుపాదేయ మెట్టిదనుచు
అల్ప సుఖమును వీడ ననల్ప దుఃఖ హాని సమకూరు విజ్ఞుడియ్యది యెఱుంగు
స్వల్పమియ్యది విషయ సంజన్య సుఖము, జన్మమృత్యు పరంపర చాల దుఃఖ
మది తొలంగును పరమాత్మ నాశ్రయింప, విషయసుఖముల విడనాడి విరతి జెంది

తాత్పర్యము స్పష్టము

63. ధీవరదత్తమహామిషమశ్నన్ వైసారిణో మ్రియతే
తద్వద్విషయాన్ భుంజన్ కాలాకృష్టో నరః పతతి

మీను గాలంబు తుదియెరన్ మ్రింగి చచ్చు విషయ విషభుక్తి నమృతాత్మ వీడి కాల
పాశమును బొందు నరుడు తత్పరవశతను క్షణికమును గోరి శాశ్వతక్షతిని జెందు

తాత్పర్యము స్పష్టము

64. ఉరగగ్రస్తార్ధతనుర్భేకోఽ శ్నాతీహ మక్షికాః శతశః
ఏవం గతాయురపి సన్ విషయాన్ సముపార్జయత్యజ్ఞః

పాము మ్రింగెను తన నగపాలు, దేహ మంటిన నీగల మ్రింగుటకై తెరచును

నాల్కనిదె కప్ప; యటులనే నరుడు, విషయ సుఖములొనగూర్చుకొను చావు స్ఫురణ లేక

తాత్పర్యము స్పష్టము

# 5

# మనోనిగ్రహ ప్రకరణము

65. స్వీయోద్గమతోయవహా సాగరముపయాతి నీచమార్గేణ
    సా చేదుద్గమ ఏవ స్థిరా సతీ కిం నయాతి వార్ధిత్వమ్?
66. ఏవం మనః స్వహేతుం విచారయత్సుస్థిరం భవేదన్తః
    న బహిర్వ్యేదేతి తదా కిం నాత్మత్వం స్వయం యాతి?

**పుట్టినచోట నుద్గమనమున్ గను నీ నది నీచమార్గమం**
**దట్టులె పోయి సాగరము నందుకొనున్, నట నుద్గమంబె యా**
**పట్టున సుస్థిరంబయిన వారిధిగా నది గాదె యీ మనం**
**బట్టులె యుద్గమించి కననై చని యాత్మమూలమున్**
**గట్టిగ బాహ్యదృష్టి విముఖంబయి చెందదె యాత్మభావమున్**

తన జన్మస్థానమునుండి నీరు పైకి ఉబికి వచ్చి నదియైనది. అది నీచమార్గమును అంటే పల్లపుదారిని బట్టి పోయి సముద్రములో కలుస్తుంది. అలాకాకుండా ఆ ఉబికిన నీరు అక్కడనే స్థిరపడినచో అది నదిగాక సముద్రమే అయిఉండేది. అట్లాగే, మనస్సు తనకు స్ఫూర్తినిచ్చే ఆత్మజ్ఞానమును మరచి బాహ్యజ్ఞాన నిరూపణములో, అనగా నామరూప వివక్షలో వికారమును చెందినది. అట్లా ద్వంద్వమోహమనే వికారమును చెందకుండా తనలోనికి ప్రసరించిన ఆత్మజ్ఞానాన్ని తనలోనే నిలుపుకుంటే అప్పుడు మనస్సు ఆత్మస్వరూపమునే చెందుతుంది. అదే అమనస్కస్థితి. అదే జాగ్రత్, స్వప్న, సుషుప్తులకు సాక్షియైన తురీయావస్థ మనస్సు ద్వైతజ్ఞానాలకు, ద్వైత అజ్ఞానాలకు అతీతంగా అంతర్ముఖమై ఆత్మజ్ఞానంలో లీనమై పోవడం.

67. వర్షాస్వమ్బుప్రచయాత్ కూపే గురునిర్ఝరే పయః క్షారమ్
గ్రీష్మేదేవ తు శుష్కే మాధుర్యం భజతి తత్రామ్బుః

68. తద్వద్విషయోద్రిక్తం తమః ప్రధానం మనః కలుషమ్
తస్మిన్ విరాగశుష్కే శనకైరావిర్భవేత్ సత్త్వమ్

వానల నీరు వచ్చిపడ వాగుల నూతుల నీరు నుప్పగా
నౌను, నిదాఘమందు జలమచ్చతగాంచి, క్రమేపి తీయనౌ
మానసమూను కల్మషమమన్దతమః స్ఫురితాశయంబులన్
బూని, విరక్తి శుష్కమయి పోవు కొలందిని సత్త్వమున్ గనున్

వర్షాకాలంలో నూతులు నిండిపోతాయి. అయితే భూమిలోని క్షారములు వర్షపునీటితో కలిసి చేరుకొనుట వలన ఆ నీరు ఉప్పగా ఉంటుంది. ఎండాకాలంలో ఆ బావిలో లోతైన జెల తియ్యగా ఉండుటచేత, వర్షపునీరు ఇగిరిపోవడం చేత ఆ నీరు తీయగా అవుతుంది. అదే విధంగా, మనస్సు బాహ్యమైన విషయాలను ఎక్కువగా ఆస్వాదించడం వల్లనూ, అందుకోసం చేసే రకరకాల ప్రయత్నాలవల్లనూ తమః ప్రధానమౌతుంది. విరక్తిచెంది, బాహ్యవిషయాస్వాదన తగ్గిపోయినప్పుడు, మనస్సులో రజస్తమో గుణములు క్షీణించి సత్త్వగుణం వృద్ధిచెందుతుంది.

69. యం విషయమభిలషిత్వా ధావతి బాహ్యేంద్రియద్వారా
తస్యాప్రాప్తౌ ఖిద్యతి తథా తథా స్వం గతం కించిత్

విషయమేదేని గురిసేసి వెఱ్ఱి పరువులెట్టు బాహ్యేన్ద్రియముల వెంట నెడద
కడకు నది దక్కదో దిగుల్ గుడుచు, చిల్లిగవ్వ పోయిన నట్టి రాగాలు పెట్టు

తాత్పర్యము స్పష్టము

70. నగనగరదుర్గదుర్గమసరితః పరితః పరిభ్రమచ్చేతః
యది నో లభతే విషయం విషయన్త్రితమివ ఖిన్నమాయాతి

నగనగర దుర్గ దుర్గమ జగతిన్, సరిదద్రిగతుల సంభ్రమణమునన్
దగు విషయలాభమొదవక, ఁబొగులును చిత్తమ్ము విషవిమూర్ఛితము బలెన్

తాత్పర్యము స్పష్టము

71. తుమ్బీఫలం జలాన్తర్బలాదధః క్షిప్తమప్యుపైత్యూర్ధ్వమ్
తద్వన్మనః స్వరూపే నిహితం యత్నాద్బహిర్యాతి

జలముల బలమున ముంచిన, కొలదిని సొరబుర్ర మీదకున్ లేచెడి, న
ట్టుల మనసు నిలుపు కొలదిని నిలక స్వరూపమున వెలికి నిచ్చలు దూకున్

మనసుకు స్వతస్సిద్ధముగా బాహ్యదృష్టియే స్వభావము. దీనిని బలవంతముగా బాహ్యదృష్టినుండి మరలించి, అంతర్యములోని ఆత్మవైపు త్రిప్పినను గాని, అక్కడ స్థిరముగా నిలువక బాహ్యవృత్తినే ఆశ్రయించి ప్రవర్తిస్తుంది.

72. ఇహ వా పూర్వభవే వా స్వకర్మణైవార్జితం ఫలం యద్యత్
శుభమశుభం వా తత్తద్భోగో-ప్యప్రార్థితో భవతి

73. చేతఃపశుమశుభపథం ప్రధావమానం నిరాకర్తుమ్
వైరాగ్యమేకముచితం గలకాష్ఠం నిర్మితం ధాత్రా

ఇదె జన్మంబునగాని పూర్వభవమందేగాని యార్జించుకొ
న్నది భోగింప శుభాశుభమ్ముగు ఫలంబర్థింపకే వచ్చు, నీ
మది నిత్యమ్మశుభానికే పరువిడున్, మళ్లింప నీయొద్దు కో
గుదిబండన్ విధి చేసె దీనిని బుధుల్ గుర్తింత్రు వైరాగ్యమున్

ఈ జన్మలోకాని, పూర్వజన్మములలో కాని చేజేతులా చేసుకున్న కర్మఫలము శుభమైనా, అశుభమైనా కాలమే సంఘటింపచేస్తుంది. మనం ప్రార్థింపకపోయినా శుభం వస్తుంది, తప్పించుకోవాలని అనుకున్నా అశుభం వచ్చి తీరుతుంది. ఈ మనస్సు అశుభాలు కలిగించే పనులవైపు, సంకల్పాలవైపు ప్రసరిస్తుంది. ఈ మనస్సు అనే పశువును, దారి తప్పుతుంటే మళ్లించడానికి విధాత ఒక గుదిబండను మెడకు కట్టించినాడు. దానిపేరే వైరాగ్యము. మనస్సు బహిఃప్రపంచము వైపు లాగితే, అది మిథ్య అని జ్ఞాపకం చేయడానికి వైరాగ్యమే పనిముట్టు.

74. నిద్రావసరే యత్ సుఖమేతత్ కిం విషయజం; యస్మాత్
న హి చేన్ద్రియప్రదేశావస్థానం చేతసో నిద్రా

ఎందున నిద్రలో ననుభవించిన సౌఖ్యము బాహ్యసంభవ
మ్మందురె? దెందమింద్రియ వితానమునన్ వసియించి నిద్రలో

నందగ చేయుసౌఖ్యమన నద్ది పొసంగదు! చిత్త మాత్మనే
చెంది విలీనమై పరవశించిన సౌఖ్యమదే స్వరూపమౌ

గాఢనిద్రలో మనం అనుభవించే సౌఖ్యము బయటి ప్రపంచంనుంచి సమకూరింది అని ఎవరూ అనరు. ఎందుకంటే మనస్సే ఇంద్రియాల ద్వారా బాహ్య ప్రపంచంతో వ్యవహరిస్తుంది. ఈ మనస్సుయొక్క ప్రవృత్తి గాఢనిద్రలో ఉండదు. దీనిని కాదు అని వాదించడానికి, మనస్సు ఇంద్రియాలలో లీనమైఉంటుంది అనీ, సుఖం ఆ ఇంద్రియాల ద్వారా సమకూరుస్తుంది అని అంటే ఆ మాట చెల్లదు. ఎందుకంటే మనస్సు ఇంద్రియాలకు అధిపతియే కాని ఇంద్రియాలకు మనస్సుమీద ఆధిపత్యం లేదు. పైగా మనస్సు ద్వైతజ్ఞానములను విశ్లేషించే స్వభావము కలది. ఇంద్రియప్రవృత్తి బాహ్యంలో లేకుండా మనస్సుకు పనిలేదు. అందుచేత మనస్సు ఆత్మలో లీనము అవడంచేతనే సుఖం ఆత్మనుండే మనకు అందుతోంది, మనస్సులోనుంచి కాదు.

75. అద్వారతుఙ్గకుడ్యే గృహేఽ పరుద్ధో యథా వ్యాఘ్రః
బహునిర్గమప్రయత్నైః శ్రాంతస్తిష్ఠేత్ పతన్ శ్వసంశ్చ తథా

తే॥ గుమ్మమే లేక ఎత్తైన గోడలు కల, యింటిలోపల పులిని బంధించియుంప
వెలికి జనగోరి దూకుచున్ పలువిధాల నలసిసొలసియు నిట్టూర్పులొలయ నిల్చి
శాంతమై నేలబడును విశ్రాంతి గనుచు, స్వాంతమిట్టిదె విషయసంభ్రాంత మిద్ది

76. సర్వేన్ద్రియావరోధాత్ ఉద్యోగశతైరనిర్గమం వీక్ష్య
శాన్తం తిష్ఠతి చేతో నిరుద్యమత్వం తదాశ్రయతి

పలు ప్రయత్నాల నింద్రియద్వారములను వెలికిపోలేమి గమనించి తలపులుడిగి
శాంతమై నిల్చు తనయంత స్వాంతమపుడు, అంతట నిరుద్యమత్వమ్మునందుకొనును

మనస్సును నిలకడగా ఉంచడానికి ఇంద్రియాలు అనే ద్వారముల ద్వారా బయటి ప్రపంచము లోపలికి పోనీయకుండా ఉంచడమే మార్గము. ఇంద్రియములను పూర్తిగా నిగ్రహిస్తే మనస్సు స్వాధీనమౌతుంది. అంటే అంతరదృష్టితో ఏకాగ్రత పొందుతుంది. పులి కూడా ఎంత బలవంతమైనా, ఎత్తైన గోడలు దాటడానికి దూకి దూకి విఫలమై, అలసిపోయి, మెత్తబడిపోతుంది. మనస్సు కూడా ఎంత అనివార్యశక్తి కలదియైనా పులివలెనే లొంగిపోతుంది.

77. ప్రాణస్పన్దనిరోధాత్, సత్సఙ్గాత్, వాసనాత్యాగాత్
హరిచరణభక్తియోగాత్ మనః స్వవేగం జహాతి శనైః

ప్రాణస్పందన మాపుట, జ్ఞానులతో జెలిమి, వాసనాత్యాగమునన్
మానసపు వేగమెడలు ననూనము హరిచరణభక్తియోగమ్మునమున్

ప్రాణమునకు మనస్సుకు ఒకానొక అనిర్వాచ్య సంబంధం ఉన్నది. ప్రాణాయామం చేత ప్రాణాన్ని స్తంభింపజేస్తే, మనస్సు నిలకడ జెందుతుంది. వాసనాత్యాగము క్రమంగానే రావాలి. ఎట్లాగంటే, కర్మలన్నీ మాయామయ జగత్తువే కనుక, ఆ కర్మవాసనలు కూడా మాయామయములే. జగన్మిథ్యాత్వభావం దృఢమైతే అవి అంతమౌతాయి. హరి అనుగ్రహం మాయను అతిక్రమించగలదు కనుక తోడవుతుంది. అంతేకాక హరిభక్తి కాక వేరు గతిలేదు. ఈ లోకంలో అందరూ కాలానికీ, మాయకూ వశమై ఉన్నారు. హరియే వీటికి అతీతుడు కనుక శరణ్యుడు.

# 6

# వైరాగ్య ప్రకరణము

78. పరగృహాగృహిణీపుత్రద్రవిణానామ్ ఆగమే వినా వా
కథితౌ హర్షవిషాదౌ కిం వా స్యాతాం క్షణం స్థాతుః

పొరుగింటి నాలుబిడ్డలు, సిరులబ్బిన మోదమగునె చెడినన్ ఖేద
స్ఫురణమగునె యా వాకిట, నరనిముసము కూరుచున్న యాగంతునికిన్

తాత్పర్యము స్పష్టము

79. నైవాత్ స్థితం గతం వా యం కించిత్ విషయమీద్యమల్పంవా
నో తుష్యన్ నో సీదన్ వీక్ష్య గృహేష్వతిథివన్నివసేత్

ఘనమైన నల్పమేయైనను, నున్నను దైవవశమునన్ బోయిననై
నను పొంగక క్రుంగకయున్, తన యింటన యతిథివోలె తానుండవలెన్

తాత్పర్యము స్పష్టము

80. మమతాభిమానశూన్యో విషయేషు పరాఙ్ముఖః పురుషః
తిష్ఠన్నపి నిజసదనే న బాధ్యతే కర్మభిః క్వాపి

మమతను నభిమానము విడి, క్రమముగ విషయమ్ములం బరాఙ్ముఖుడగు న
త్తము డింట నుండియును క్షోభము నెందం డెందు కర్మబంధనములచేన్

ఈ జాగ్రదవస్థనే స్వప్నముగా భావించే జ్ఞానికి అహంకారము, మమకారము ఉండవు. ప్రాపంచిక విషయములు స్వప్నప్రాయములుగా భావించి వాటిని అనుభవించడానికి ఆసక్తుడు కాడు. అతడు ఇంటిలో ఉన్నను, గృహపోషణలో నిమగ్నుడై ఉన్నను, అన్ని పనులు నిర్వహిస్తూ ఉన్నాగాని వాటి సిద్ధిని గురించిగాని అసిద్ధిని గురించిగాని క్షోభము చెందడు. అట్టివానికి కర్మబంధములు ఉండవు. నిత్యుడైన జీవునికి ఈ ప్రపంచానుభవములన్నీ స్వప్నప్రాయములే.

81. కుత్రాప్యరణ్యదేశే సునీలతృణవాలుకోపచితే
 శీతలతరుతలభూమౌ సుఖం శయానస్య పురుషస్య

82. తరవః పత్రఫలాఢ్యాః సుగన్ధ శీతానిలాః పరితః
 కలకూజితవరవిహగాః పరితో మిత్రాణి కిం న స్యుః

నీలపురంగు పచ్చికల నిర్మల వాలుకలందు జల్పలన్
దేలెడు చెట్లనీడల వనిన్ శయనించెడి యోగికాప్తులై
క్రాలవె పత్ర పుష్ప ఫలరంజితముల్ తరుపుంజముల్, సుగం
ధాలస శీతలానిల విహారములున్ ఖగకూజితంబులున్

సర్వసంగ పరిత్యాగియైన యోగికి అరణ్యము, అక్కడి ఫలవృక్షములు, పక్షులు మిత్రులవలె సంతోషం కలిగిస్తాయి. లేత పచ్చికలు, చెట్లనీడలు శయనిస్తున్నవానికి ఆహ్లాదం కలుగజేస్తాయి. మందమారుతము, పక్షుల కలకలము మిత్రునివలె పలుకరిస్తాయి.

83. వైరాగ్యభాగ్యభాజః ప్రసన్నమనసో నిరాశస్య
 అప్రార్థితఫలభోక్తుః పుంసో జన్మని కృతార్థతేహ స్యాత్

ఘనవైరాగ్యమె భాగ్యమై తనిసి చక్కందేరు చిత్తమ్ము, నె
మ్మనమం దాసలుఁరోసి, యే ఫలమునున్ ప్రార్థింపకే ప్రాప్తిజెం
దిన మోదమ్మున నాహరించు నతడే, నిత్యాత్మ సంతుష్టు డా
యనఘుండిప్పుడె యీ జనిన్ బడయు నిత్యంబౌ కృతార్థత్వమున్

వైరాగ్యశీలుడై ఆశలు మాని, కోరకనే వచ్చు ఫలమును, భుజించి సంతుష్టుడైన వానికి ఈ జన్మలోనే కృతార్థత్వము లభిస్తుంది. అంటే ముక్తియే.

84. ద్రవ్యం పల్లవతశ్చ్యుతం యది భవేత్ క్వాపి ప్రమాదాత్ తదా
శోకాయాథ తదర్పితం శ్రుతవతే తోషాయచ శ్రేయసే
స్వాతన్త్ర్యాత్ విషయాః ప్రయాన్తి యదమీ శోకాయ తే స్యుశ్చిరం
సంత్యక్తాః స్వయమేవ చేత్ సుఖమయం నిఃశ్రేయసం తన్వతే

పడెనొకరచ్యుతంబగుచు పల్లవమంతటి ద్రవ్యమేనియున్
కడువగపంద జేయు; నటుగాక సమర్పితమై సువిద్వరే
ణ్యుడుగొన శ్రేయమున్ ముదము నొందగ జేయు, తమంత బాసి చే
వ్వడు విషయమ్ములన్నియును బాధలు దుఃఖములే యొనర్చు, నే
మొడ, తనచే త్యజింపబడి యిచ్చు సుఖైకరసమ్ము మోక్షమున్

ఎంత చిన్నవస్తువైనా చేతులార పోగొట్టుకుంటే బాధ ఉంటుంది. అలాకాక ఒకానొక విద్వాంసునకు బుద్ధిపూర్వకంగా ఇస్తే మనకు సంతోషము, శ్రేయస్సు కలిసివస్తాయి. ఏ విషయమైనా తనంతటనే చేజారిపోతే బాధ. అది బుద్ధిపూర్వకముగా త్యాగం చేస్తే పుణ్యమూ పురుషార్థమూ ఉంటాయన్న తృప్తి ఉంటుంది.

85. విస్మృత్యాత్మ నివాస ముత్కటభవాటవ్యాం చిరం పర్యటన్
సంతాపత్రయదీర్ఘదావదహనజ్వాలావలీవ్యాకులః
వల్గన్ ఫల్గుషు సుప్రదీప్త నయనశ్చేతఃకురంగో బలా
దాశాపాశవశీకృతోపి విషయవ్యాఘ్రైర్భృశాహన్యతే

స్వాంతమ్మన్ మృగమాత్మనే మరచి సంసారాటవీ భ్రాన్తమై
సంతాపత్రయ దాహపీడితమున్నై, స్వల్పార్థముల్ గోరుచున్
వంతల్ జెందుచు నాశ పాశమున తన్ బంధింప సుజ్ఞానదీ
ప్తాంతఃచక్షువులుండియున్ విషయమన్ వ్యాఘ్రంపు నోటంబడున్

మనసు తన ఉనికిపట్టు అయిన ఆత్మను మరచి బాహ్య పదార్థములు సుఖం కలిగిస్తాయనే భ్రాన్తితో, నిరర్థకమైన విషయములయందే సంచరిస్తుంది. ఇది లేడివలె సంసారము అనే అడవిలో పరుగెత్తుతూ, ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, అధిదైవికములైన తాపములు, ఆ అడవిలోని దావాగ్నివలె బాధింపగా, ఎన్నో కష్టాలకు ఓర్చుకుని, ఆశాపాశమునకు లోబడి సూచిస్తుంది. పెద్ద పెద్ద కనులు లేడికి వున్నట్లే, మనస్సుకు అంతఃచక్షువులు, విమర్శరూపమైనవి ఉన్నాగాని, విషయవాంఛ అనే వ్యాఘ్రమునకు అది స్వాధీనమైపోతుంది.

# 7

# ఆత్మసిద్ధి ప్రకరణము

86. ఉత్పన్నేఽపి విరాగే వినాప్రబోధం సుఖం న స్యాత్
    స భవేత్ గురూపదేశాత్ తస్మాద్గురు మాశ్రయేత్ ప్రథమమ్

    గట్టివిరాగము పుట్టిన, బుట్టదు సుఖమాత్మబోధమును గన కదియున్
    బుట్టును గురూపదేశత, నట్టగుటన్ గురుసమాశ్రయమె తగు మొదటన్

వైరాగ్యం మనస్సులో ఉద్భవించినా, ఆత్మసుఖం ప్రాప్తించాలి అంటే ప్రబోధము (అజ్ఞానము అనే నిద్దురనుండి మేలుకొలిపే జ్ఞానము) లేకుండా జరుగదు. ఈ ప్రబోధము గురువువల్లనే కలుగుతుంది. అందుచేత మోక్షార్థియైనవాడు మొదట గురువునే ఆశ్రయించాలి.

87. యద్యపి జలధేరుదకం యద్యపి వా ప్రేరకోఽనిలస్తత్ర
    తదపి పిపాసాకులితః ప్రతీక్షతే చాతకో మేఘమ్

    జలధిం జలములు కల, వావల నవి రేపుటకు గలవు వాయువులున్ గొం
    దలపడునైనన్ దప్పిక, జలదము కొఱ కెదురుచూచు, చాతక మెపుడున్

సముద్రములోనూ, సరోవరములలోనూ నీరు పుష్కలముగా ఉన్నా, గాలులు ఆ జలాన్ని తరంగములుగా మారుస్తూ ఉన్నా, తాను దప్పికతో ఉన్నా చాతకపక్షి వాననీటి కొరకు మేఘముకొరకే ఎదురుచూస్తుంది. అట్లాగే వేదాంతగ్రంథాలు ఎన్ని ఉన్నా, వాటికి వ్యాఖ్యానాలు ఎన్ని ఉన్నా, మోక్షార్థియైన శిష్యుడు గురువుకొరకే ఎదురు చూస్తాడు. ఎందుకంటే, శిష్యుని మనస్సులోని పక్వతను బట్టి గురువు బోధిస్తాడు. పుస్తకాలకు ఆ గురువుకు ఉన్న పరిశీలన ఉండదు.

88. త్రేధా ప్రతీతిరుక్తా శాస్త్రాత్, గురుతః, తథాత్మనస్తత్ర
శాస్త్రప్రతీతిరాదౌ తద్వన్మధురో గుడోఽస్తీతి

89. అగ్రే గురుప్రతీతిర్ద్వారాత్ గుడదర్శనం యద్వత్
ఆత్మప్రతీతి రస్మాత్ గుడభక్షణజం సుఖం యద్వత్

తీయగ బెల్లముండునను తీరది శాస్త్రముచే ప్రతీతి, ముం
దాయది బెల్లముంగను మటంచది యెల్ల గురుప్రతీతి, తా
నాయది తింట చేత సుఖమందుట యాత్మప్రతీతి యివ్విధం
బాయె ప్రతీతి ముప్విధములై పరిభాషగ శాస్త్రపద్ధతిన్

ప్రతీతి అనగా జ్ఞానము స్ఫురించుట. ఒకటి శాస్త్రము వలన, రెండు గురువువలన, మూడవది ఆత్మవలన. అందులో మొదటిది శాస్త్రప్రతీతి, బెల్లము తియ్యగా ఉండునని తెలియడం. రెండవది గురుప్రతీతి, బెల్లమును చూపించి ఇదే బెల్లము అని చెప్పడం. మూడవది ఆత్మప్రతీతి, బెల్లమును తిని తీయదనం తెలిసికొనడం. అంటే స్వానుభవము. జ్ఞానమునకు ఇవి మూడు మెట్లు.

90. రసగంధరూపశబ్దస్పర్శా అన్యే పదార్థాశ్చ
కస్మాదనుభూయన్తే నో దేహాత్ నేంద్రియగ్రామాత్

స్పర్శ రూపమ్ము గంధమున్ శబ్దము, రస మితర మనుభవమందుట దేనివలన?
దేహమున కాదు, కలుగ దింద్రియముల నట కలను లేవివి! ఆత్మచే కలుగు నిద్ది

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ జ్ఞానములు, ఇతర పదార్థముల గుర్తింపు ఎవరివల్ల జరుగుతున్నాయి? దేహం వల్లనా? కాదు. ఇంద్రియాలు లేకుండా దేహం ఏమీ తెలుసుకోలేదు. అయితే ఇంద్రియాల వల్ల తెలుస్తున్నాయా? అంటే జాగ్రత్తులో ఇంద్రియాలు పనిచేస్తే తెలుస్తున్నాయి. మరి కలలో ఇంద్రియాలు పనిచేయకపోయినా ఈ జ్ఞానాలన్నీ వస్తున్నాయే. అందుచేత ఇవి అన్నీ ఆత్మచేతనే తెలియబడుతున్నాయి.

91. మృతదేహేన్ద్రియవర్గో యతో న జానాతి దాహజం దుఃఖమ్
ప్రాణశ్చేత్ నిద్రాయాం తస్కరబాధాం స కిం వేత్తి

మృతిని దేహేన్ద్రియములున్నను తెలియవుగ దహన దుఃఖము ప్రాణమే తగు నెఱుంగ
నన నదియు నిద్రలో దొంగ నరయలేదు తెలివి దేహేన్ద్రియ ప్రాణములను లేదు

మరణకాలంలో దేహము, ఇంద్రియాలు స్థూలశరీరంగా ఉన్నాగాని తగలబడేప్పుడు దుఃఖమును తెలుసుకోలేవు. నిజానికి ఎప్పుడైనాగాని అన్ని జ్ఞానాలు లింగదేహంవల్లనే వస్తున్నాయి. ఈ లింగ దేహము మరణకాలంలో దేహాన్ని విడిచి వెళ్లిపోయినది. లింగ దేహము అంటే "భూతాంతఃకరణ ప్రాణ జ్ఞాన కర్మేంద్రియైర్యుతం, అవిద్యా కామ కర్మాఢ్యం. లింగం పుర్యష్టకం విదుః" అంటే పంచభూతములయొక్క సూక్ష్మరూపములైన పంచతన్మాత్రలు, అంతఃకరణము, ప్రాణము, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, అవిద్య, కామవాసనలు, కర్మవాసనలు అని లింగదేహము ఎనిమిది అవయవములతో ఉంటుంది. ఎవరైనా ప్రాణమే దహన దుఃఖము తెలుసుకొని లేచిపోయింది అని వాదిస్తే, ప్రాణానికి తెలివి వుంటే నిద్రలో దొంగను గుర్తించినదా? అని అడగాలి. ప్రాణము కూడా లింగ శరీరములోని భాగమే. తెలివియే ఆత్మ. ఏదైనా ఆత్మయే తెలుసుకోగలదు.

92. మనసో యది వా విషయస్తద్యుగపత్కిం న జానాతి
    తస్య పరాధీనత్వాత్ యతః ప్రమాదస్య కర్తాత్రా

**మనసె తెలివికి మూలమా యన నదియును పలువిషయముల నొకమారె తెలియలేదు**
**పరునికది యధీనము సమన్వయము కొరకు మనసె పొరపడ తెలియజెప్పునదె ఆత్మ**

మనస్సే తెలివికి మూలమా అని విచారిస్తే కాదని తేలుతుంది. ఎందుకంటె మనసు ఏ విషయము తెలుసుకున్నా, ముందుగా ఆత్మ సమన్వయం చేసిన తరువాతనే తెలుసుకుంటుంది. అంటే మనసు ఒకేమారు పలు విషయాలు తెలిసికొనలేదు. అంతేకాక, ఒక్కొక్కసారి మనసు పొరబడితే అది తెలిసికొనేది ఆత్మయే. చిరుచీకట్లలో త్రాడును చూచి పామని మనస్సు భ్రమపడితే ఆత్మయే ఆ తప్పును సరిజేస్తుంది.

93. గాఢధ్వాన్తగృహాన్తతః క్షితితలే దీపం నిధాయోజ్జ్వలం
    పంచచ్ఛిద్రమధోముఖం హి కలశం, తస్యోపరి స్థాపయేత్
    తద్బాహ్యే పరితో-ను రంధ్రమమలాం వీణాంచ కస్తూరికాం
    సద్రత్నం వ్యజనం న్యసేచ్చ కలశచ్ఛిద్రాధ్వనిర్గచ్ఛతా
94. తేజోంశేన పృథక్ పదార్థనివహజ్ఞానం హి యజ్జాయతే
    తద్రన్ధ్రైః కలశేన వా కిము మృదోభాండేన తైలేన వా

కిం సూత్రేణ నచైతదస్తి రుచిరం ప్రత్యక్షబాధాదతో
దీపజ్యోతిరిహైక ఏవ శరణం దేహే తథాఽఽత్మా స్థితః

చిమ్మచీకటి, యింటిలో గ్రమ్ముకొన్న,
కెలన నుజ్జ్వలదీపము క్షితితలమున
నుంచి దానిపై బోర్లించి యుంపవలయు
నయిదు రంధ్రాల కలశమ్ము నంతనచట
వీణ, కస్తూరి, రత్నమ్ము, వీవనయును,
శబ్దమున్ గన్ధ రూపసంస్పర్శనాత్మ
కములు; జుట్టును కలశరంధ్రములు నాల్గు
గప్పికొన జేర్చ మిగిలిన కలశరంధ్ర
మందు నుండి వినిర్గతమైన వెలుగు యింటిలోని పదార్థంబు లెఱుగ జూపు
నిట్టి యెఱుకకు కారణమేదటన్న కావు రంధ్రముల్, కలశమ్ము కాదు ప్రమిద
కాదు, తైలమ్ము వత్తియున్ గావు శబ్ద, గన్ధ, రూప సంస్పర్శ విఖ్యాతియైన
గాదు, ప్రత్యక్షమింటిలోగల వెలుంగు దీపమందలి జ్యోతి యందించునెపుడు
దేహమందలి యాత్మ యీ వెలుగు బూని తెలివియై యుండు నింద్రియములను మించి

దేహమందలి నేత్రాది రంధ్రములు ఆత్మజ్ఞానమును, ప్రసరింపజేసే వాహికలేగాని, వాటికి జ్ఞానస్పర్శ లేదు. అంతేకాదు, నేత్రజ్ఞానం ప్రవర్తించేచోట, శబ్ద, స్పర్శ, రస, గంధ జ్ఞానములు ప్రవర్తింపవు. ఆత్మజ్యోతియే అన్ని జ్ఞానాలకు ప్రసారకేంద్రము.

# 8

# మాయాసిద్ధి ప్రకరణము

95. చిన్మాత్రః పరమాత్మా హ్యపశ్యదాత్మాన మాత్మతయా
    అభవత్ సోఽ హంనామా తస్మాదాసీద్ భిదో మూలమ్

96. ద్వేధైవ భాతి తస్మాత్ పతిశ్చ పత్నీ చ తౌ భవేతాంవై
    తస్మా దయమాకాశః త్రిధైవ పరిపూర్యతే సతతమ్

**తనుదానీక్షణ సేసె తా సకలమున్ దానౌట చిన్మాత్రుఁడా**
**యన సాక్షాత్ పరమాత్మ, కల్గెనట సోహంవృత్తి, భేదాన కె**
**ల్లను మూలంబది, దాన ద్వంద్వము, జడప్రాణుల్ పతుల్ పత్నులున్**
**జనియింపన్ పురుషుండు, స్త్రీ, నభము, విశ్వమ్మయ్యె సంపూర్ణతన్**

కేవలము తెలివియైన పరమాత్మ (ఆయన సర్వవ్యాపి, అద్వితీయుడు) తన చుట్టూ పర్యవేక్షించినాడు. తననే తాను చూచుకున్నాడు. ఆయన దృష్టికి విషయంగా అహంవృత్తి గోచరించింది. అదే ప్రకృతిలో పరమాత్మ ప్రతిబింబం. లోకంలోని భేదభావానికి అదే కారణము. అప్పుడు పరమాత్మ, ప్రకృతి రెండు విధములుగా పతి, పత్నిగా తెలియబడినారు. (పరమాత్మ శివుడుగాను, అహంవృత్తి పార్వతిగానూ తెలియబడినారు. లలితాదేవి స్తోత్రంలో "అహమిత్యేవ విభావయే భవానీం" అన్నమాట ఉన్నది. దీనికి అర్థం – "భవానీదేవిని నేను అహంవృత్తిగా భావిస్తున్నాను" అని) ఈ పతి, పత్ని భావములతో స్త్రీ పురుషులతో జగత్తు నిండగా మూడవదిగా ఆకాశము ఉద్భవించి సమస్తమును తనలోనే ఇమిడించుకున్నది.

97. శ్లో॥ యమపేక్షాం చక్రే తతోమనుష్యా అజాయన్త
ఇత్యుపనిషదః ప్రాహుర్దయితాం ప్రతియాజ్ఞవల్క్యోక్త్వా

98. విరమానన్దానుభవాత్ సుషుప్తి రివ కాప్యవస్థాభూత్
పరమాత్మనస్తు తస్మాత్ స్వప్నవదేవోత్థితా మాయా

**అత డీక్షింప మనుష్యులై రటుపయిన్ ఆ మాటయున్ బల్కి రా**
**శతరూపంగని యాజ్ఞవల్క్యుండనుచున్ జాటించు వేదాంతముల్**

**వితతానందరసానుభూతిని సుషుప్తిం బోలు కొండొక్క స్వ**
**స్థతలో నాపరమాత్మనుండి పొడమెన్ స్వప్నాకృతిన్ మాయ దాన్**

పరమాత్మ వీక్షిస్తే ఆయన ప్రతిబింబాలుగా మనుష్యులు అయినారు. ఈ మాట భార్యతో యాజ్ఞవల్క్యుడు అన్నట్లు ఉపనిషత్తులే చెప్పినాయి. పరమాత్మ ఆనందస్వరూపుడు. ఈ ఆనందస్వరూపమే మనుష్యులలో సుషుప్తి అవస్థగా అయినది. (పరమాత్మలో ఆనందము జ్ఞానస్వరూపము. సుషుప్తిలోని ఆనందము పరమాత్మ స్వరూపము. అజ్ఞానం, అంటే ఘనీభవించిన ద్వంద్వభ్రాన్తి జ్ఞానాన్ని మరుగుపరుస్తుంది.) ఆ తరువాత పరమాత్మనుండియే స్వప్నావస్థకు దీటుగా మాయ ఉద్భవించినది. (మాయ అంటే ద్వంద్వభ్రాన్తియే) (స్వప్నంలో తానే అనేక చరాచర జగత్తుగా అయి తనతో వ్యవహరించడం ఉంటుంది. ఈ సమయంలోని భ్రాన్తికి మాయ అని పేరుపెట్టినారు. ఇదే రకమైన మాయనే ఈశ్వరుడు తనకు వశం చేసుకొని స్వప్నంలో వలెనే తననుండియే ఈ చరాచర జగత్తును కల్పించినాడు. ఈశ్వరుడు, అంటే పరమాత్మయే తన నిరాకారత్వమును మాని శుద్ధసత్త్వస్వరూపమైన ఉపాధిని ధరించుట. మనుష్యుడు అంటే పరమాత్మయే అవిద్యను ఉపాధిగా చేసుకుని సత్త్వ, రజ స్తమో గుణముల కూడలియైన ఉపాధులను ధరించుట. అందుచేత ఈశ్వరుడు అంటే శుద్ధసత్త్వస్వరూపమైన మాయలో పరమాత్మ ప్రతిబింబము. దేవ, మనుష్య తిర్యక్ జాతులన్నీ త్రైగుణ్య స్వరూపముగా మాయను అవిద్యగా మార్చి, ఆ అవిద్యలో పరమాత్మ ప్రతిబింబాలుగా తెలియబడినవి. ఈ అవిద్యయే అహంకారముగా మారి దేవమనుష్య తిర్యక్ జాతులను తమ ఉపాధులే తమ స్వరూపమని భ్రమింపజేస్తుంది.)

99. సదసద్విలక్షణా–సౌ పరమాత్మసదాశ్రయానాదిః
సా చ గుణత్రయరూపా సూతే చరాచరం విశ్వం

100. మాయా తావ దదృశ్యా దృశ్యం కార్యం కథం జనయేత్
తన్తుభిరదృశ్యరూపైః పటో–త్ర దృశ్యం కథం భవతి

సదసద్భిన్నము సత్సమాశ్రయమునై సత్త్వాది రూపమ్మునై
మొదలన్ గన్న దనాది మాయయె జగమ్మున్ జంగమస్థావరా
స్పదమున్ తానె యదృశ్యమై విపుల దృశ్యమ్మైన కార్యమ్మునె
ట్లది చేయందగు? వస్త్రముల్ కలుగునే యా నూలు కన్పట్టగన్

మాయ సదసద్భిన్నము అంటే ఉన్నదీ కాదు లేనిదీ కాదు. అంటే సృష్టికి పూర్వము పరమాత్మ నిరాకార స్వరూపంలో, అంటే అద్వైత స్వరూపంలో ఉంటే తాను తప్ప రెండవ పదార్థం లేని పరిస్థితిలో మాయ లేనిదే. అయితే సృష్టి చేయాలనే సంకల్పము పరమాత్మకు కలిగినప్పుడు ఆ సంకల్పమే మనస్సుగా అయి అదే మాయగా ఆవిర్భవించింది. అంటే ఈశ్వరభావంలో ఉన్నదే. ఈశ్వరుని శుద్ధసత్త్వ ఉపాధి మాయ కార్యమే. అట్లాగే జీవుల అవిద్యోపాధి కూడా త్రైగుణ్యస్వరూపము ధరించిన మాయయే. ఆ విధంగా పరమాత్మ భావంలో లేనిదీ, ఈశ్వర, జీవభావాల్లో ఉపాధి భావంలో ఉన్నదీ అయినది. అయితే జీవేశ్వరులు ఇద్దరూ పరమాత్మ ప్రతిబింబాలు అయినందుననూ, వారి ఉపాధి స్వరూపమైన మాయ, ఈ ప్రతిబింబము ద్వారా సంక్రమించిన సత్, చిత్, ఆనందముల వల్లనే ప్రవర్తింప కలిగినందుననూ ఈ మాయ, సత్ అంటే నిరంతరంగా ఉన్న పరమాత్మ యొక్క ఆశ్రయంతోనే ఉంటుంది. అనగా, సత్ = ఉన్నది అని తెలియబడే అన్ని వస్తువులలోనూ అసత్ రూపంగా ఉంటుంది. అంటే ఉన్నది అని తెలియబడే అన్ని పదార్థాలలోనూ నశించే పదార్థము మాయగానూ, నశింపని పదార్థము పరమాత్మగానూ తెలియబడుతూ ఉంటుంది. అయితే పరమాత్మ యొక్క అద్వితీయ భావంలో లేనిదే అయిన మాయ, ఉన్నది అని తెలియబడే జీవేశ్వర జగత్తులుగా ఎట్లా కల్పించింది? కనుపించని దారంతో, కనుపించే వస్త్రము తయారు అవుతుందా?

101. స్వప్నే సురతానుభవాత్ శుక్రద్రావో యథా శుభే వసనే
అన్వృతం రతం ప్రబోధే వసనోపహతిర్భవేత్ మిథ్యా

102. స్వప్నే పురుషః సత్యో యోషిదసత్యా తయోర్యుతిశ్చ మృషా
శుక్రద్రావః సత్యః తద్వత్ ప్రకృతేఽపి సంభవతి

కలలో నంగన బొందినట్టయిన శుక్రస్రావమౌ నచ్చమౌ
వలువన్ మేల్కన బొం దబద్ధమయినన్ వస్త్రంబుపై దాగు చూ
పులకున్ గోచర; మా కలం బురుషు దెప్డున్ నిక్కమే కాన్తి యా
కలికిం గూడు టబద్ధ మట్లె ప్రకృతిన్ గైసేయుటే యాత్మయున్

లేనిదే అయిన మాయ సత్యస్వరూపుడైన పరమాత్మతో కలసి ఈ చరాచర జగత్తును నిర్మించింది. దీనికి తార్కాణము – లేనిదే అయిన కలలోని స్త్రీ, సత్య స్వరూపుడైన పరమాత్మ అనే పురుషునిలో భ్రాన్తి కల్పించి శుక్రస్రావము అనే సత్యమైన పరిణామము కల్పించినది. చిరుచీకట్లలో త్రాడును చూచి పామని భ్రమించి గుండెదడ, చెమటలు నిజంగా కల్పించలేదా? అంటే అర్థం భ్రమవల్ల మాయ ఈ జగత్తును కల్పించింది అని. అంటే జగత్తు కూడా నిజంగా లేనిదే అయినా భ్రమచేత పరమాత్మయే జగత్తుగా తెలియబడుతూ ఉన్నాడని సారాంశం. ఆ భ్రమయే మాయ.

103. ఏవ మదృశ్యా మాయా తత్కార్యం జగదిదం దృశ్యం
మాయా తావ దిదం స్యాత్ యా స్వవినాశేన హర్షదా భవతి
104. రజనీవాతిదురన్తా నలక్ష్యతే స్వభావో-స్యాః
సౌదామినీవ నశ్యతి మునిభిః సంప్రేక్ష్యమాణైవ

కనబడదిట్లు మాయ అగుగా కది చేసిన యీ జగమ్మిటన్
కనబడు తాను చేద్పడి సుఖం బొసగున్ గన బ్రహ్మ భావమున్
కన వినరాదు చీకటులు గ్రమ్మిన రాతిరి నైజ మిట్టి మా
యను మునులట్టె చూడ విలయమ్మగు చీకటి విద్యుతిన్ బలెన్

ఈ విధంగా కనబడని మాయ, కనబడుతూ ఉన్న జగత్తుగా కనుపిస్తూ ఉన్నది. 'యత్ దృశ్యం తన్నశ్యం' అని వేదాంతం చెప్తోంది. కనబడే ఈ జగత్తు నశించినా, ఈ జగత్తుకు ఆధారమైన పరమాత్మ సత్‌పదార్థంగా ఎప్పుడూ ఉంటాడు గనుక, భ్రమాత్మకమైన మాయ నశించినప్పుడు సత్‌పదార్థమైన పరమాత్మయే తెలియ బడుతాడు. అంటే సర్వత్ర నామరూపాలతో ఉన్న జగత్తులో అంతటా నామరూపాలు లేని పరమాత్మ గోచరిస్తాడు. అదే బ్రహ్మ సాక్షాత్కారము, మాయ అనబడే భ్రమ నశిస్తే బ్రహ్మపదార్థమే గోచరిస్తుంది. మాయ చీకటి వంటిది. చీకటి అనే పదార్థము ఎక్కడా లేదు. అయితే చీకటి ప్రకాశము వల్ల తొలగిపోయినట్లు, మాయ జ్ఞానం వల్ల తొలగిపోతుంది. మునులు జ్ఞాననేత్రంతో చూస్తే మెరుపు మెరిసినప్పుడు చీకటి మాయమై పోయినట్లు, మాయ తొలగిపోయి పరమాత్మ గోచరిస్తాడు.

105. మాయా బ్రహ్మోపగతా–విద్యా జీవాశ్రయా ప్రోక్తా
చిదచిత్ గ్రన్థిః చేతః తదక్షయం జ్ఞేయ మామోక్షాత్

మాయ బ్రహ్మమ్మునందె సంభవము నొందు జీవునాశ్రయించు నవిద్య సృష్టియందు
తెలివితో భ్రమ ముడిగొన్న తీరె చిత్త, మిది నశింపదు జీవత్వమెదలు దనుక

మాయ పరమాత్మ యొక్క సృష్టి సంకల్పము యొక్క స్వరూపమై, అనగా మనస్సుగా అయి, ఈశ్వరునికి ఉపాధియై పరమాత్మ ప్రతిబింబమును పరిగ్రహించి సృష్టిని కల్పిస్తుంది. జీవుడు అవిద్యయందు పరమాత్మ ప్రతిబింబమై భ్రమాత్మకమైన సృష్టికి కారణమౌతాడు. ఈశ్వరుని ఉపాధియైన మాయ శుద్ధసత్త్వమయినందున విద్య అంటారు. జీవుని ఉపాధియైన అవిద్య సత్త్వ, రజ, స్తమో గుణములతో కలిసిన మనస్సు యొక్క స్వరూపము. ఈ మనస్సే సంకల్ప వికల్పాలు చేసినప్పుడు మనస్సు అని, నిశ్చయం చేసినప్పుడు బుద్ధి అనీ, దేహాన్ని, కర్మేన్ద్రియాలను వినియోగించి ఏదైనా కర్మకై పూనుకున్నప్పుడు అహంకారమనీ, మనస్సు జ్ఞానేంద్రియముల వల్ల సంపాదించిన జ్ఞానములను సమీక్షించినప్పుడు చిత్తమనీ అంటారు. ఈ చిత్తములో పరమాత్మ ప్రతిబింబమైన జ్ఞానము, సత్త్వ, రజ స్తమోగుణ స్వరూపమైన అవిద్య ముడివడిపోయి ఉంటాయి. దీనినే చిత్, అచిత్ గ్రన్థి అంటారు. ఈ ముడి విడిపోవాలి అంటే జీవునికి అవిద్య కల్పించే త్రైగుణ్యములైన వాసనలు నశించాలి. ఇలా వాసనలు నశిస్తే జీవునికి మోక్షము వచ్చినట్లే. ఎందుకంటే అవిద్య లేనప్పుడు జీవుడు పరమాత్మ కంటే వేరు కాదు. తెలివియే స్వరూపమైన పరమాత్మ అవిద్యాస్వరూపమైన చిత్తమునందు ప్రతిఫలనము వల్ల జీవునిగా అయి, అవిద్య నశిస్తే పరమాత్మగా మిగిలిపోతాడు. అదే మోక్షము. అంతవరకు ఈ చిదచిత్ గ్రన్థి విడిపోదు.

106. ఘటమఠకుడ్యైరావృతమ్ ఆకాశం తత్తదాహ్వయం భవతి
తద్వదవిద్యావృతమిహ చైతన్యం జీవ ఇత్యుక్తః

ఘటము, మఠము కుడ్యమున సంఘటితమైన ఆకస మటులనే పేర్లనందినట్లు
ఆవరణ మవిద్య వలన నంది జీవు డనుట కలిగెను చైతన్యమునకు జగతి

పరమాత్మయే తన ప్రతిబింబమును ప్రతిగ్రహించిన అవిద్యతో కలిసి జీవుడని చెప్పబడుతున్నాడు. పరమాత్మయే చైతన్యము. ఈ చైతన్యము అంతటా ఆకాశము వలె వ్యాపించి ఉంటుంది. ఘట, మఠ, కుడ్యములను ఆవరించిన ఆకాశము, ఘటాకాశము,

మఠాకాశము, కుడ్యాకాశము అనే పేర్లు పొందినట్లే అవిద్యయందు స్ఫురించే చైతన్యమునకు జీవుడు అని పేరు వచ్చినది.

107. నను కథమావరణం స్యాద్ అజ్ఞానం బ్రహ్మణో విశుద్ధస్య
సూర్యస్యేవ తమిస్రం రాత్రిభవం స్వప్రకాశస్య

**మరి విశుద్ధ చిద్రూప మాత్మ నిటులావరించె నజ్ఞానమనుట యిదెట్లు కలిగె?**
**రాత్రి కలిగెడు చీకటి రవిని గప్ప, జాలునే యెందునను ప్రకాశస్వరూపు**

బ్రహ్మము, చైతన్యము, పరమాత్మ పర్యాయపదములు. జీవుడనగా అవిద్యను ఉపాధిగా గ్రహించిన పరమాత్మయే – ఆకాశము ఘటమును ఉపాధిగా గ్రహించి ఘటాకాశము అయినట్లు. పరమాత్మ జ్ఞానస్వరూపుడు కదా, చీకటి వంటిది కదా అవిద్య, సూర్యుని చీకటి కప్పలేనట్లు, పరమాత్మను అవిద్య కప్పజాలదు కదా అని ప్రశ్న.

108. దినకర కిరణోత్పన్నైర్మేఘైరాచ్ఛాద్యతే యథా సూర్యః
నఖలు దినస్యదినత్వం తైర్విక్రృతైః సాంద్రసంఘాతైః

**జలదములు రవి కిరణ సంకలితములవి, దట్టమై చేరి రవిబింబ మట్టె గప్పు**
**దినమె దుర్దినమగునట్టి తీరు గనమె ఆత్మ తన వీక్షణమున తన్నావరించు**

రవికిరణముల వల్లనే మేఘము ఏర్పడినది. ఆ మేఘముల సమూహమే రవి ప్రకాశమును తగ్గించి, దినమును దుర్దినము అనేటట్లు చేస్తుంది. జీవుడు అవిద్యవల్లనే తనను, జగత్తును పరమాత్మకంటే వేరుగా భావిస్తున్నాడు. ఈ అవిద్య ఎట్లా సంభవించినది? త్రైగుణ్యములైన వాసనలు మనస్సును ఆవరించడంవల్ల. ఈ వాసనలు జీవుని పూర్వకర్మములు అవిద్యాభరితములైనందున కలిగినవి. జీవుడు అనాదిగా ఉన్నాడు. అవిద్య అనాదిగా ఉన్నది. జీవునికి అవిద్యతో వ్యవహారం అనాదిగా ఉన్నది. ఈ వ్యవహారం అంతా పరమాత్మ చైతన్యం ప్రవర్తించడంవల్లనే ఎప్పుడైనా జరిగేది. పరమాత్మ చైతన్యం అవిద్యలో ప్రసరించడం వల్లనే ఏ కర్మ అయినా నిర్వహింపబడేది. రవి తన కిరణముల వల్లనే మేఘములను కల్పించినట్లు, చైతన్యము తన ప్రవృత్తి వల్లనే అవిద్యను సంఘటింపజేసి, తన స్వరూపమే అయిన జీవునికి తాను మరుగు పడేటట్లు చేస్తున్నది. అవిద్య లేకపోతే జీవునికి తానే పరమాత్మగాను, జగత్తు కూడా పరమాత్మగానూ గోచరించేది. అనాదియైన అవిద్య ఎట్లా లేకుండా పోతుంది? అంటే విద్యవల్ల అవిద్య నిర్వర్తింపబడుతుంది. విద్య అంటే "జీవో బ్రహ్మైవ నాపరః" అన్న జ్ఞానమే. అంటే జీవుడు పరమాత్మ కంటే వేరు కాదు అనే జ్ఞానమే.

109. అజ్ఞానేన తథాత్మా శుద్ధోఽపి చ్ఛాద్యతే సుచిరమ్
న పరం తు లోకసిద్ధా ప్రాణిషు తచ్చేతనా శక్తిః

**చేతనాశక్తి ప్రాణులన్ చిజ్జడముల గ్రన్థి, యజ్ఞాన మాత్మను కప్పు టిదియె**
**భ్రమను జీవుడు నానాత్వభావమంది తనను ఆత్మను వేరుగా తలచుకొనుట**

విశుద్ధమైన జ్ఞానమే అనగా చైతన్యమే పరమాత్మ యొక్క స్వరూపము. పరమాత్మ సృష్టి సంకల్పమే మనస్సుగా ఆవిర్భవించి అదే ప్రకృతిగా ప్రకటించుకొని, దేహేన్ద్రియ జగత్తులుగా మారి, ఆ పరమాత్మనే జీవునిగా రూపొందించి, తానే జీవునికి ఉపాధిగా అయి, ఆ జీవునికి పరమాత్మ ఇంద్రియ గోచరమయ్యే విధంగా పరమాత్మనే జగత్తుగా, జీవులుగా చూపిస్తుంది. జీవునికి మనస్సు ద్వారానే ఇంద్రియ ప్రవృత్తి తెలుస్తుంది. కాని ఈ మనసులో పరమాత్మ ప్రతిబింబముగా తనలో నింపిన చైతన్యమువల్లనే జడములైన జీవుని ఉపాధులు ఏ కర్మలోనైనా ప్రవర్తిస్తాయి. అయితే మనస్సే బుద్ధిగా నిశ్చయాత్మకమగుటచేతనే జీవుడు నేను చేస్తున్నాను అనే భావనతో, అహంకార స్వరూపమైన మనస్సు వల్లనే కర్మలు నిర్వహిస్తాడు. మనసు అనాత్మయగుటచే జడము చైతన్యముతో కలిసినందున జీవుడు చిదచిత్ గ్రన్థి యొక్క స్వరూపము. అన్ని పనులు ఈ చిదచిత్ గ్రన్థివల్లనే నిర్వహింపబడుతున్నాయి. దీనికే చేతనాశక్తియని పేరు. దీనినే మాయ అనీ, భ్రమ అనీ, అహంకారమనీ పిలుస్తారు. ద్వైతజగత్తులో ఈ చేతనాశక్తి భవానీ స్వరూపము. శుద్ధమాయయైన ఉపాధిని గ్రహించి భ్రమాత్మకముగా సృష్టి, స్థితి, లయములు చేసే ఈశ్వరుడు పరమాత్మ స్వరూపమే అయిన శివుడు. భవానీ స్తోత్రంలో అమ్మవారికి చేతనా అనీ, భ్రమారూపా అనీ, "అహమిత్యేవ విభాయే భవానీం" అనడంచే అహం రూపా అనే మాటలు ప్రాచుర్యంలో ఉన్నాయి. అద్వైతజ్ఞానంలో శివుడు ఒక్కడే నిరాకారం, ఏ ఉపాధి కూడా లేకుండా అద్వితీయంగా ఉన్నాడు. "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః " అని శ్రీకృష్ణుడు గీతలో చెప్పినాడు. శుద్ధజ్ఞానమును చీకటి వంటి అజ్ఞానం ఎట్లా ఆవరించింది అన్న ప్రశ్నకు, ఈ ఆవరణ భ్రమాత్మకమేనన్నది సమాధానము. దీనివల్లనే జీవుడు తాను పరమాత్మనేననీ, దృశ్య ప్రపంచం అంతా కూడా పరమాత్మ స్వరూపమేనన్న అసలు నిజాన్ని మరచిపోతాడు.

# 9

# లింగదేహాది ప్రకరణము

110. స్థూలశరీరాంతర్లిఙ్గశరీరం చ తస్యాన్తః
కారణమస్యాప్యన్తస్తతో మహాకారణం తుర్యమ్

స్థూలశరీరములోనన్ గ్రాలున్ లింగమ్ము నందు కారణదేహ
మ్మూలోన మహాకారణ మీలాగున నాల్గు కల్గు నీ దేహమ్ముల్

మనుష్యునికిగాని, ఏ ప్రాణికైనాగాని నాలుగు రకములైన శరీరాలు ఉంటాయి. మొదటిది అందరికీ కనుపించే స్థూల శరీరము. రెండవది కనుపించని లింగశరీరము. మూడవది అందులోని కారణశరీరము. నాల్గవది తదంతర్గమైన అవిద్య, మహాకారణ శరీరము.

111. స్థూలం నిరూపితం ప్రాక్, అధునా సూక్ష్మాదికం బ్రూమః
అంగుష్ఠమాత్రః పురుషః శ్రుతిరితి యత్ ప్రాహ తత్ సూక్ష్మమ్

స్థూల నిరూపణమైనది, యీ లోనన్ సూక్ష్మతనువు నగు నియ్యదియే
పాలించు దేహము బొటనవ్రేలంతటి పురుషుడనుచు వేదము పలికెన్

దేహనిందా ప్రకరణములో స్థూలదేహము నిరూపించబడినది. ఇంక సూక్ష్మ దేహమును గురించి చెప్తున్నాము. అంగుష్ఠమాత్రుడైన పురుషుడు ఈ దేహములో సూక్ష్మంగా ఉంటాడు అని వేదము చెప్పినది.

112. సూక్ష్మాణి మహాభూతాన్యసవః పంచేన్ద్రియాణి పఞ్చైవ
షోడశమంతఃకరణం తత్సంఘాతో హి లింగతనుః

అయిదు తన్మాత్ర లసువులు నయిదు నైదు తనరు జ్ఞానేంద్రియములు నంతఃకరణము
కలిసి పదునారు వీని సంఘాతమదియె లింగదేహమటంచు పల్కెదరు బుధులు

తాత్పర్యము స్పష్టము

113. తత్ కారణం హియత్ స్యాత్ తస్యాంతర్వాసనాజాలమ్
తస్య ప్రవృత్తిహేతుర్బుద్ధ్యాశ్రయ మత్ర తత్తుర్యమ్

లింగదేహంబునందు వర్తించు వివిధ వాసనలె కారణంబని పలికె శ్రుతులు
ఇది ప్రవర్తించు దేన? దుతీయదేహ మది మహాకారణము బుద్ధికాశ్రయంబు

కారణదేహమనగా లింగదేహమునందు అంతర్గాతముగా ఉన్న కామ, కర్మ వాసనా జాలము. జీవుని పూర్వజన్మములలోని ప్రవృత్తిని బట్టి వాసనాజాలము ఏర్పడి అంతః కరణమునందు గుణవైవిధ్యమును కల్పిస్తుంది. ఈ గుణవైవిధ్యమే జీవుని స్థూల ఉపాధిని నిర్ణయిస్తుంది. ఈ వాసనాజాలము దేనివల్ల కలిగినదో అదే మహాకారణము. ఇది బుద్ధికి ఆశ్రయము. దీని స్వరూపము బుద్ధిలోని అవిద్య. ఈ అవిద్యయే బాహ్య ప్రపంచములోని నామ, రూపములు పరమాత్మకంటే బుద్ధిలో వేరన్నట్లుగా భ్రాన్తి కల్పిస్తుంది .

114. తత్సారభూతబుద్ధౌ యత్ ప్రతిఫలితం తు శుద్ధచైతన్యమ్
జీవః స ఏవకార్త్స్న్యో-హమితి స్ఫూర్తి కృద్ వపుష

సారమే బుద్ధియగు మహాకారణమున
శుద్ధచైతన్యమాత్మయే బుద్ధియందు
ప్రతిఫలించిన నద్దాని బలికినారు
జీవుడను పేర పూర్వులున్ జేయు నితడె
అహమహమనెడి స్ఫురణ దేహంబునందు

తాత్పర్యము స్పష్టము

115. చరచరతరఙ్గ సఙ్గాత్ ప్రతిబింబం భాస్కరస్య చ చలంస్యాత్
అస్తి తథా చఞ్చలతా చైతన్యే చిత్తచాఞ్చల్యాత్

ఉరకలిడు తరగలన్ దా నురకలిడున్ భానుబింబ మోహో! చిత్తపుటే
పరుగుల చాంచల్యమ్మే తెలియందగు ప్రతిఫలించు చైతన్యమునన్

కదలాడే జలతరంగములలోని భానుని ప్రతిబింబము చాంచల్యము చెందినట్లే, చిత్తములోని చాంచల్యము బుద్ధిలో ప్రతిఫలించిన చైతన్యమునకు సంభవిస్తుంది. అనగా భ్రమాత్మకంగా జీవునికి సంభవిస్తుంది.

116. నన్వర్కప్రతిబిమ్బః సలిలాదిషు యః స చావభాసయతి
కిమితరపదార్థనివహం ప్రతిబిమ్బో-ప్యాత్మన స్తద్వత్

ఇతరముల దెలుపగలదే? ప్రతిబింబము రవి జలాదులను గనుపింపన్
ప్రతిబింబమె గద జీవుడు! నతడును గనదాత్మ జగతి వ్యాపింపనిచో

నీటిలోని రవి ప్రతిబింబము ఇతర వస్తువులను తెలియపరచలేదు. అట్లే చిత్ ప్రతిబింబమైన జీవుడు కూడా దేనినీ ప్రకాశింపజేయలేదు.

117. ప్రతిఫలితం యత్తేజః సవితుః కాంస్యాది పాత్రేషు
తదనుప్రవిష్టమన్తర్గృహమన్యార్థాన్ ప్రకాశయతి

118. చిత్ప్రతిబింబస్తద్వత్ బుద్ధిషు యో జీవతాం ప్రాప్తః
నేత్రాదీన్ద్రియమార్గైర్బహిరర్థాన్ సో-వభాసయతి

రవికిరణములు కంచుపాత్రలను దాకి ప్రతిఫలనమున నిల్లంత వ్యాప్తిజెంది
సకలవస్తువులన్ బ్రకాశమొనరించు నట్లే చైతన్య మింద్రియ వ్యాప్తిజెంది
బుద్ధియందు ప్రతిఫలనమ్మునఁ జిదాత్మ జీవనామమ్ముగొని బహిఃస్థితవిషయము
లందు నేత్రాది పంచేన్ద్రియముల మార్గ మెఱిగి వ్యాపించి తనని చూపించుకొనును

చిదాత్మ బుద్ధియందు ప్రతిఫలించి జీవుడు అనిపించుకుంటాడు. చిదాత్మ ప్రతి బింబముతో గూడిన బుద్ధి ఇంద్రియముల ద్వారా బయటికి వ్యాపించి బాహ్యార్థము లను తెలుసుకుంటుంది. చైతన్యము ప్రకాశింపజేస్తుంది, బుద్ధి తెలిసికొంటుంది, రవిప్రకాశము కంచుపాత్రలనుండి పరావర్తనము చెంది, ఇంటిలో వెలుగు నింపినట్లు.

# 10

# అద్వైత ప్రకరణము

119. తదిదం య ఏవ మార్త్యో వేదబ్రహ్మోహమస్మీతి
స ఇదం సర్వం స్యాత్ తస్య హి దేవాశ్చ నేశతే భూత్యా

ఈ విధి నెవ్వడు తానే యీ విశ్వము నేను బ్రహ్మ మేనని తెలియున్
నా విద్వాంసుడె సర్వ మ్మా వైభవ మరుదు సురలకైన నిజముగన్

"అయమాత్మా బ్రహ్మ" అని మహావాక్యము. ఈ ఆత్మ, అంటే నేనుగా తెలియబడే ఈ ఆత్మ బ్రహ్మమే. అనగా కనిపించే విశ్వములోని అసలు తత్త్వము. అంటే ఎప్పటికీ నశించని తత్త్వము, అది నేనే. ఈ విధముగా ఏ విద్వాంసుడు అనుభవము ద్వారా తెలిసికుంటాడో అతడే సర్వమూ అవుతాడు. అట్టి వైభవము దేవతలకు కూడా అందుబాటులో లేనిదే.

120. యేషాం నభవత్యాత్మా యో-న్యా మథ దేవతాముపాస్తే యః
అహమన్యో-సావన్యశ్చేత్థం యో వేద స పశువత్సః
121. ఇత్యుపనిషదా ముక్తిః తథా శ్రుతిర్భగవదుక్తిశ్చ
జ్ఞానీత్వాత్మైవేయం మతిర్మమేత్యత్ర యుక్తిరపి

ఏ నరు డన్యదేవత భజించునొ "యయ్యది వేరు నేనువే
రేనని" యెవ్వడేని మదినెంచునొ జంతువు వాడు వట్టి య
జ్ఞానియె యన్న దయ్యుపనిషత్తు శ్రుతుల్ భగవానుడే యనెన్
"జ్ఞానియు నాత్మయే యనుట నామత"మంచు పృథాతనూజుతోన్

ఎవడు తనను ఆత్మగా భావించుకొనడో, ఎవడు ఇతర దేవతతలను ఉపాసిస్తూ, నేను వేరు ఈ దేవత వేరు అన్నట్లుగానే తెలుసుకుంటాడో ఆతడు పట్టి పశువే, అజ్ఞానగ్రస్తుడు. ఈ మాట ఉపనిషత్తే పలించినది. శ్రీకృష్ణభగవానుడు అర్జునునితో ఈ మాటయే అన్నాడు. ఏమని? "జ్ఞానియైనవాడు ఆత్మయే అనడం నా నిశ్చయము."

122. ఋజువక్రం వా కాష్ఠం హుతాశదగ్ధం సద్ అగ్నితాం యాతి
తత్ కిం హస్తగ్రాహ్యం ఋజువక్రాకారసత్త్వేఽపి

123. ఏవం య ఆత్మనిష్ఠో హ్యాత్మాకారశ్చ జాయతే పురుషః
దేహీ న దృశ్యతేఽసౌ పరం త్వసౌ కేవలోహ్యాత్మా

తిన్ననిదైన వంకరలు తేరినదైనను కట్టె నిప్పుగన్
మున్నెటులున్న దానిజెయి ముట్టగ రా దటులాత్మనిష్ఠుడై
యున్న తదాత్మరూపుడె యగున్ గనరాదట దేహి వేరుగా
నున్నదె యొక్క తత్త్వమదియున్ పరమాత్మయె కేవలమ్మటన్

తా. ...ము స్పష్టము

124. ప్రతిఫలతి భానురేకోఽనేక శరావోదకేషు యథా
తద్వదసౌ పరమాత్మా హ్యేకోఽనేకేషు దేహేషు

125. ద్వైవాదేకశరావే భగ్నే కింవా విలలీయతే సూర్యః
ప్రతిబిమ్బచఞ్చలత్వా దర్కః కిం చఞ్చలో భవతి

ఒక రవి పెక్కు మూకుడుల నున్న జలమ్ముల బెక్కు రూపులౌ
నొక పరమాత్మయే యటులనుండును దేహములెన్ని యన్నిటన్
నొకట విభగ్నమైనదియె పో! నొక మూకుడు దాన లీనమౌ
నొక ప్రతిబింబమే! యినుడు పోవునె? గాలికి నీరు చంచల
మ్మొకట పరిత్రైన భాస్కరుదునున్ ప్రతిబింబముతో చలించునే?

తాత్పర్యము స్పష్టము

126. స్వవ్యాపారం కురుతే యథైకసవితుః ప్రకాశేన
తద్వత్ చరాచరమిదం హ్యేకాత్మా సత్తయా చలతి

127. మేనోదకేన కదలీచమ్పక జాత్యాదయః ప్రవర్తంతే
మూలకపలాణ్డులశునాస్తే నైవేతే విభిన్నరసగంధాః

126, 127

ఒక రవి వెల్గులో నెఱపుచుండు జరాచరమాత్మకార్య; మ
ట్లొకడగు నాత్మయున్కి కదలొందు సమస్తము; నట్లు జాతి చం
పకములు నే జలమ్ములన వర్ధిలు, ముల్లగి, యుల్లి మున్నుగా
సకలము దాన వర్ధిలు; రసమ్ములు వాసన వేరువేరుగాన్

పరమాత్మ చైతన్యము అందరు ప్రాణులయందునా సమానముగా ఉన్నందుననే, వారి వారి పనులు వారి ఇష్టము ప్రకారమే నెరవేర్చుకుంటున్నారు. ఇది ఎట్లాగంటే చెట్లకు సమానంగానే నీరు పెట్టినప్పుడు అరటి, చంపక వృక్షములు వర్ధిల్లినట్లే ముల్లంగి, ఉల్లి, వెల్లుల్లి మొక్కలు కూడా వర్ధిల్లుతాయి. కాని వాటి వాటి సహజగుణాలతోనే పెరుగుతాయి. సంపెంగ సువాసన మానదు. వెల్లుల్లి తన సహజవాసన మానదు. అట్లాగే సర్వజనులు పరమాత్మ చైతన్యం వల్లనే ప్రవర్తింపగలుగుతున్నా, వారి వారి ప్రవృత్తులు మాత్రం వారి స్వభావంలోని గుణాలవల్లనే జరుగుతూ ఉంటాయి.

128. ఏకో హి సూత్రధారః కాష్ఠప్రకృతీరనేకశోయుగపత్
స్తమ్భాగ్ర పట్టికాయాం నర్తయతీహ ప్రగూఢతయా

ఒక్కడే సూత్రధారుడు పెక్కు బొమ్మలవి విభిన్న ప్రకృతులుగా నమరియొక్క
తటిని తెరపైన జేరి నర్తనము జేయ చతురతన మించు తాను గూఢత చరించి

తోలుబొమ్మ ఆటలో ఒక్కడే సూత్రధారుడు, పెక్కు పాత్రధారులుగా తోలు బొమ్మలను ఏర్పఱచి, తెరవెనుక దీపచ్ఛాయ చేత, బొమ్మలతో వివిధ పాత్రలను కల్పిస్తూ తాను తెరవెనుక నుండి, దారములతో అన్ని బొమ్మలను ఒకేసారి కదిలిస్తూ, సంభాషణలు పలువురిచేత చెప్పిస్తూ, నాట్యంగాని, నాటకంగాని నిర్వహిస్తాడు. అట్లాగే ఈశ్వరుడొక్కడే ఈ ప్రపంచమనేటి నాటకరంగంలో అనేక పాత్రధారులచేత వైవిధ్యమైన సంఘటనలు, వైవిధ్యమైన స్పందనలతో, వైవిధ్యమైన అభినయము చేయిస్తాడు. తోలుబొమ్మలాటలో సూత్రధారుడు దారంతోపాత్రలను ప్రవర్తింపజేస్తే, ఈశ్వరుడు తానే అంతర్యామిగా వేర్వేరు

రూపములు ధరించి, కథాక్రమము తాను ముందే కాల స్వరూపుడై నిర్ణయింపగా జగన్నాటకమును నిర్వహిస్తాడు. శ్రీకృష్ణుడు తానే గోపకులుగానూ, వత్సములుగానూ మారి ఒక సంవత్సరం అంతా దీనినే గోకులంలో నిర్వహించినాడు.

129. గుడఖణ్డశర్కరాద్యాః భిన్నాః స్యుః వికృతయః యథైవేక్షోః
కేయూరకఙ్కణాద్యాః యథైకహేమ్నో భిదాశ్చ పృథక్

130. ఏవం పృథక్ స్వభావం పృథగాకారం పృథగ్ వృత్తి
జగదుచ్చావచముచ్చైః ఏకేనైవాత్మనా చలతి

**బెల్లమును శర్కరాదులు భిన్న వస్తు**
**వులు వికృతులవి చెఱకు ముక్కలకు, హేమ**
**కంకణమ్ములు కేయూరకటకములును**
**హేమమునకున్న వేర్వేరు నామములవి**

ఈ విధి పృథక్ స్వభావమ్మై వృత్తులు రూపములును నాయా విధమై
ఈ విశ్వ మెచ్చుతగ్గులదై వర్తించుట చిదాత్మదౌ నిపుణతనే

బెల్లము, చక్కెర వేర్వేరు పదార్థములైనా అవి చెరకురసము నుండి ఏర్పడినవే. అట్లాగే కేయూరములు, కంకణములు కూడా వేర్వేరు అలంకారములైనను బంగారము నుండి ఏర్పడినవే. అట్లాగే లోకంలోని భిన్నస్వభావములు, భిన్నాకారములు, భిన్న ప్రవృత్తులు, ఇవన్నీ పరమాత్మ చైతన్యము వల్లనే సంఘటింపబడినవి. ఈ సంఘటనమే విశ్వంలో కనుపించే హెచ్చుతగ్గులకు కారణమౌతుంది. ఉపాధులు వేరైనా స్పందన చైతన్యమువల్లనే.

131. స్కంధధృతసిద్ధమన్నం యావన్నాశ్నాతి మార్గగస్తావత్
పుర్శభయక్షుత్పీడే తస్మిన్ భుంక్తే స తే భవతః

**దారి నడచెడువాని సిద్ధాన్నమెపుడు భుజగతంబయ్యు భయమది పోదు నీచ**
**జనులు తాకెదరంచు భోజనము సేయ భయము వీడును నాకలి బాధమాను**

దారిలోన నడిచే మనుష్యుడు భుజమునుంచి వ్రేలాడు సంచిలో సిద్ధపఱచిన అన్నము ఉన్నాగాని, తను అక్కడున్నప్పటి స్థలమూ, అక్కడి జనమూ పరిశుభ్రముగా లేరేమోననే భయంతో ఆకలిగా ఉన్నా, ఇప్పుడు కాదు తరువాత తిందాము అనే భావనతో నడుస్తూ

ఉంటాడు. ఏదో ఒక స్థలం చూసుకొని ఆ అన్నం తినివేస్తే ఆ భయమూ పోతుంది, ఆకలీ తీరుతుంది. అట్లాగే మానవుడు జగత్తులో వ్యవహరించే టప్పుడు అహంకారమును అవలంబిస్తే అందరు జనులూ, అన్ని స్థలములూ తనకు అనుకూలం కానట్లు భావన ఉంటుంది. అహంకారం తనలోనే లయం చేసుకుంటే, సర్వాత్మభావంలో అందరూ తనవారే. అన్ని స్థలాలూ తనవే.

132. మానుషమతంగమహిషశ్వసూకరాదిష్వనుస్యూతమ్
యః పశ్యతి జగదీశం స ఏవ భుఙ్క్తేఽద్వయం నందమ్

**మనుజు, లేళ్ళలు, దున్నలు, శునక, సూకరముల దేహములందుననే రహి చరించి**
**లోన నెలకొని జగదీశ్వరుడు వెలుంగు ననెడి భావన స్థిరమైన నతడె గనును**
**అద్వయానంద రససుధాస్వాదనమును**

అన్ని జంతువుల దేహములలో అంతర్యామిగా పరమాత్మయే ఉన్నాడనీ, ఆ పరమాత్మయే జగదీశ్వరుడనీ, తాను ఆ జగదీశ్వరుని కంటే వేరుకాననే, భావన స్థిరంగా ఏర్పరచుకుంటే, ఆ ధన్యుడు అద్వయానందరససుధాస్వాదనమును కలుగజేసు కుంటాడు. అంటే, పరమాత్మకంటే వేరు పదార్థమే లేని పరిస్థితిలో పరమాత్మ స్వరూపమే అయిన సాటిలేని, తరిగిపోని ఆనందమును తనలోనే దర్శించి అమృతమును ఆస్వాదించినంత తృప్తిని అనుభవిస్తాడు.

# 11

# కర్తృత్వభోక్తృత్వ ప్రకరణము

133. యద్వత్ సూర్యేఽభ్యుదితే స్వవ్యవహారం జనః కురుతే
తం న కరోతి వివస్వాన్ నకారయతి తద్వదాత్మాఽపి

**రవి యుదయింపగనే తమ తమ వ్యవహారము సేసికొందు రఖిల జనమ్ముల్**
**రవి సేయదు, సేయింపదు, భువినాత్మయు నట్లె కర్త భోక్తయు గాకన్**

రవి ఉదయింపగనే జనులు తమ తమ వ్యవహారములు జరుపుకుంటారు. రవి అందరికీ మార్గదర్శకుడే గాని వారి వారి ప్రవృత్తులకు బాధ్యత వహించడు. అట్లాగే ఆత్మ కూడా. ఈ జీవుడు లోకంలో జన్మనెత్తగానే, ఆ జీవుని బుద్ధికి, శరీరానికి చైతన్యం కల్పించే ఆత్మ ఆ జీవునితోనే ఉంటాడు. కాని ఆ బుద్ధి ప్రవృత్తికి ఆ జీవుని జన్మాంతర సంచితములైన కామ కర్మవాసనలు కారణమౌతాయి. ఈ వాసనల వల్లనే ఆ బుద్ధి అహంకారంగా మారి తాను వేరు, మిగతా ప్రపంచం వేరు అనే భావనతో కర్తవ్యం భావించుకుని కర్మేన్ద్రియముల ద్వారా శరీరమును జగత్తులో వ్యవహరించేటట్లు చేస్తుంది. అందుచేత కర్తృత్వం అహంకారానికే కాని ఆత్మకు కాదు. అట్లాగే కర్మలు నిర్వహింపబడిన తరువాత వాటి ఫలితముల కొరకు బుద్ధి ఆశిస్తుంది. అయితే అనంతకోటి జీవరాశులలో ఆయా బుద్ధులు ఆయా సంకల్పానుసారంగా కర్మలు చేస్తూ ఉంటే ఆ కర్మలన్నిటికీ ఒక సమష్టి సమన్వయము, ఫలితము ఉంటాయి. ఈ సమష్టి పరిశీలనమును ఈశ్వరుడు కాలస్వరూపుడై ఆ కాలమే తన స్వభావంకాగా నిర్వహిస్తాడు. ఈ పరిశీలనవల్ల ఏ జీవికి ఏ ఫలితము రావాలో, ఎలాటి ఫలితం ఉండాలో, ఎంతకాలం ఈ జగత్తులో ప్రవర్తించాలో (అంటే ఆయువు) అతని పూర్వకర్మ వాసనల బట్టి, అప్పటి కర్మస్వభావమును బట్టి

కాలమే నిర్ణయిస్తుంది. ఏ పని అయినా ఇప్పుడైనా, పూర్వజన్మములలోనయినా అహంకారమే చేస్తుంది గనుక, ఆ అహంకారమే తాననుకునే జీవునికే అది అనుభవంలోనికి వస్తుంది. అందుచేతనే భగవానుడు గీతలో చెప్పినాడు "కర్మ చేయదానికే, అంటే కర్తృత్వభావనయందే నీకు అధికారం ఉన్నది కాని, కర్మ ఫలితం కాలం చేత నిర్ణయింపబడిన విధంగానే ఉంటుంది. అందుచేత కర్మఫలం నీవు ఆశించిన విధంగా ఉంటుందని భావించే అధికారం నీకు లేదు" అని. పరమాత్మ కానీ, ఈశ్వరుడు కానీ ఈ కర్తృత్వ భోక్తృత్వములలో ప్రమేయం కల్పించుకోరు. జీవుని స్వభావంవల్ల కర్మలు చేస్తే, ఈశ్వరుని స్వభావమైన కాలమే ఫలితాలు కల్పిస్తుంది.

134. లోహే హుతభుగ్వ్యాప్తే, లోహాన్తర తాడ్యమానేఽపి
తస్యాన్తర్గతవహ్నేః కిం స్యాత్ నిర్ఘాతజం దుఃఖమ్

135. నిష్ఠురకుఠారఘాతైః కాష్ఠే సంభిద్యమానేఽపి
అంతర్వర్తీ వహ్నేః కిం ఘాతైః ఛేద్యతే వహ్నిః

గట్టిగ గాలిన యినుముం, గొట్టిన లోనున్న యగ్ని కొట్టువడదు పెన్
గట్టెల గొడ్డట గొట్టిన, గట్టెలలోనున్న యగ్ని కందదు గాదే

ఇనుమును బాగుగా కాల్చి, అనేక పనిముట్లు తయారుచేయదానికి సమ్మెటతో కొట్టి పూర్వపు స్వరూపమును మారుస్తారు. అయితే ఈ సమ్మెట దెబ్బలు ఆ ఇనుమును సాగదీయడానికి ప్రవేశపెట్టిన అగ్నికి తగులుతాయా? కట్టెలలోపల అగ్ని ఉన్నది గనుకనే అగ్నిని ప్రజ్వలింపజేయడానికి కట్టెలు వాడుతారు. ఈ కట్టెలు ఎట్లా వస్తాయి? పెద్ద కొయ్యదుంగను గొడ్డలితో చిన్న చిన్న ముక్కలుగా నరికి అగ్నికి ఆహుతి చేయదానికి సిద్ధము చేస్తారు. అయితే కట్టెలలో ఉన్న అగ్ని, ఈ గొడ్డలి వేటులకు నరకువడుతుందా? అట్లాగే ఈ జన్మలోగాని, పూర్వజన్మలలోగాని చేసిన కర్మల ఫలితము కాలమే నిర్దేశింపగా శరీరమే అనుభవించి, తానే శరీరము అనుకున్న అహంకారానికి అందజేస్తుంది. అయితే తానే అహంకారాన్ని, శరీరాన్ని అనుకునే భావన మిథ్య గనుక సత్యస్వరూపుడైన ఆత్మకు ఈ బాధలు లేవు. అయితే ఈ అహంకారమే తాను అనుకునే జీవుని భ్రమలో ఈ బాధలు కూడా ఒక భాగమే.

136. తనుసంబన్ధవిజాతైః సుఖదుఃఖైః లిప్యతే నాత్మా
బ్రూతే శ్రుతిరపి భూయోఽ నశ్నన్ అన్యోఽ భిచాకశీత్యాది

ఇట్టులే యాత్మ శరీరము పట్టున సుఖదుఃఖములకు బట్టువడదు తాన్
ఇట్టుల"నశ్నన్న"ను శ్రుతి గట్టిగ సుఖదుఃఖభోక్త కాదను నాత్మన్

శరీర సంబంధములైన సుఖదుఃఖములతో ఆత్మ అంటుపడదు. జీవుడే క్షేత్రజ్ఞ రూపములో భ్రమాత్మకుడై ఈ క్షేత్రసంబంధములైన సుఖదుఃఖములను అనుభవించుచున్నాడు. పరమాత్మ భ్రమావిరహితుడైనందున అట్లు అనుభవించడు. ఇందుకు శ్రుతివాక్యం ఉన్నది. "ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్ అన్యో అభిచాకశీతి". దీనికి రావణభాష్యం- రెండుపక్షులు శరీరమును ఆశ్రయించుకొని ఉన్నాయనీ, ఆ రెండూ సమానమైన యోగము అనగా కలయిక కలవనీ, సమానమైన ఖ్యాతి అనగా స్ఫురణ కలిగి (సఖాయా) ఉన్నాయనీ, వారిలో ఒక పక్షి (అనగా జీవాత్మ) సంసారవృక్షమునకు ఫలములైన సుఖములను రుచిగా స్వీకరిస్తాడనీ, రెండవ పక్షి అనగా పరమాత్మ అట్లా భుజింపక చూస్తూ ఉంటాడనీ అర్థం.

137. నిశివేశ్మని ప్రదీపే దీప్యతి చౌరస్తు విత్తమపహరతి
ఈరయతి వారయతి వా తం దీపః కిం, తథాఽఽత్మాఽపి

దీపము వెల్గియు రాతిరి కాపుండి హరించు దొంగ కల ధనమెల్లన్
దీపము వలదన దౌ నన, దీ పగిదిన్ క్రియల సాక్షియే ఆత్మయగున్

దీపము వెలుతురు మాత్రమే కల్పిస్తుంది గాని, కర్మప్రవృత్తులైన మనుష్యులకు కర్తవ్యమును ఉపదేశింపదు. అట్లే, ఆత్మ కూడా అందరిలో దీపమువలె చైతన్యము ప్రసాదించినను వారి వారి ప్రవృత్తికి వారివారి మనోవాసనలే కారణము కనుక ఆత్మ కారణము కాదు. ఎందుకంటే ఆత్మ అద్వైత భావనలో నిండియున్నది. ద్వైతభావనలలో నిండియున్న మనస్సుకు సాక్షిగా, స్ఫూర్తిప్రదాయకంగా ఉంటుంది. కర్తృత్వభావము ద్వైతభ్రమ నిష్ఠము గనుక ఆత్మకు ఆ కర్తృత్వభావముతో సంబంధము లేదు.

138. గేహాన్తే దైవవశాత్ కస్మింశ్చిత్ సముదితే విపన్నే వా
దీపస్త్వవ్యథవా ఖిద్యతి కిం తద్వదాఽఽత్మాఽపి

పుట్టిన నెవడే నింటన్, గిట్టిన దైవికము దానికిన్ దగ దీప
మ్మిట్టే పొంగదు క్రుంగదు, అట్టుల భోక్తయును గాదు ఆత్మయునెందున్

ఇంటిలోపల ఏదో ఒక విశేషము జరిగినా, ఒక విశేషము ఆగినా దీపము స్ఫూర్తిదాయకమే కనుక మోద విషాదములు పొందదు. అయితే ఇంటిలోని వారందరూ ద్వైతభ్రమాన విష్ణులు గనుక ఆ శుభాశుభముల ప్రాప్తిచేత సుఖదుఃఖములు పొందుతారు. ఆత్మ జ్ఞాన స్వరూపము గనుక ఈ మనోభావములకు లోనుకాదు.

# 12

## స్వప్రకాశతా ప్రకరణము

139. రవిచన్ద్రవహ్నిదీపప్రముఖాః స్వపరప్రకాశాః స్యుః
     యద్యపి తథాప్యమీభిః ప్రకాశ్యతే క్వాపి నైవాఽఽత్మా

రవిచన్ద్ర వహ్ని దీపాది విశేషము స్వపరవస్తు దీపకమవుగా
కవి దెల్పజాల వాత్మను స్వవిశద మది యాత్మ తమకె భాసకమగుటన్

రవి, చన్ద్ర, దీపములు కాన్తులు వెదజల్లుతూ తమనూ, ఇతర పదార్థములనూ ప్రకాశింపజేస్తాయి. అయితే ఆత్మ ఇన్ద్రియగోచరము కాదు గనుక, వీటి ప్రకాశము ఆత్మను భాసింపజేయలేదు. ఆత్మ ఆకాశము కంటె సూక్ష్మమై, అంతకంటె ఎక్కువ వ్యాపకమైనందున, సూర్య, చన్ద్రాదులను నేత్రేన్ద్రియముల ద్వారా భాసింపజేయగలదు. పైగా అందరికీ హృదయంలో స్ఫురిస్తూ, ఏ ఇంద్రియమూ పనిజేయకపోయినా తనను తానే తెలియపరచుకుంటుంది. అందుచేత ఆత్మ స్వప్రకాశకము అని అన్నారు. రవి, చన్ద్ర, వహ్నులు నేత్రేన్ద్రియము లేకపోతే స్వప్రకాశములు కావు. తామే ఆత్మచేత ప్రకాశము పొందేవి.

140. చక్షుర్ద్వారైవ స్యాత్ పరాత్మనా భానమేతేషామ్
     యద్వా తేఽపి పదార్థా నజ్ఞాయన్తే హి కేవలాఽఽలోకాత్

వీనిని స్ఫురింపజేయునదే నిఖిలాత్మ కనులివ్వియే ద్వారమ్ముల్
కానీ యాలోకముననె వానిన్ గనరాదు ఆత్మవ్యాపింపనిచో

కన్నులు ద్వారములు మాత్రమే. ఏ వస్తువు తెలియబడాలి అన్నా, చిదాత్మ ప్రకాశముతో

కూడిన మనస్సు నేత్రద్వారము ద్వారా ఆ వస్తువునందు వ్యాపించుటచేతనే తెలియబడుతోంది.

141. తత్రా ప్యక్షిద్వారా సహాయభూతో న చేదాత్మా
నో చేత్ సత్యాలోకే పశ్యత్యన్ధః కథం నార్థాన్

కన్నులకు సహాయముగా నున్నది యీ ఆత్మ కనుక నున్నవి చూడ్కుల్
మిన్నగ నున్నను వెలుతురు నున్నకదా గుడ్డివాని చూపెప్పుడైనన్

తాత్పర్యము స్పష్టము

142. సత్యాత్మన్యపి కింనో జ్ఞానం తచ్చేంద్రియాన్తరేణ స్యాత్
అన్ధే దృక్ప్రతిబన్ధే కరసంబన్ధే పదార్థభానం హి

కన్నుల చూపులు లేకే యున్నను తగు వస్తుభానమున్నది తనకున్
గ్రన్నన చేతుల దడవిన నెన్నియొ తెలియు నితరమగు నింద్రియములచే

చిదాత్మ స్ఫూర్తియున్నప్పుడు నేత్రేంద్రియము పనిచేయకపోయినను అంధునికి దృక్ప్రతిబంధమున్ననూ చేతులతో తడిమితే పదార్థ జ్ఞానము కలుగుతుంది. అంటే స్పర్శేన్ద్రియము ద్వారా ఆత్మ ప్రసరించి పదార్థజ్ఞానము కలిగిస్తుంది.

143. జానాతి యేన సర్వం కేన చ తం వా విజానీయాత్
ఇత్యుపనిషదాముక్తిర్ధృత ఆత్మాఽత్మనా తస్మాత్

దేనం దెలియునొ సర్వము, దానిని మరిదేనఁ దెలియఁదగునని వేదాం
తానం గల దక్కతనన్, దా నాత్మయె యాత్మతో సదా పెనగొనెడిన్

"ప్రజ్ఞానం బ్రహ్మ" అన్నది మహావాక్యము. దానికి విద్యారణ్యులు చెప్పిన వివరణము ఇట్లా ఉన్నది. "దేనిచేత ఈ ప్రపంచమునందలి రూపాదికమును చూచునో, శబ్దాదికమును వినునో, గంధము నాఘ్రాణించునో, అనేక శబ్దములతో వాగింద్రియము వ్యవహరించునో, నాలుకతో తీపి, చేదు తెలిసికొనునో అట్టి అంతఃకరణ వృత్తి ద్వారా, సకలేన్ద్రియముల ద్వారా వ్యాపించిన చైతన్యము ప్రజ్ఞానమనబడుచున్నది. ఈ ప్రజ్ఞానమే సర్వాంతరమైన ఆత్మ, అదే బ్రహ్మము. ఈ ప్రజ్ఞానము బ్రహ్మాది స్తంబ పర్యంతము వ్యాపించిన చైతన్యము కంటే వేరు కాదు. చేతనాచేతనములకు ఉన్నది అనే స్ఫూర్తి కలిగించునది ఆత్మ. చేతనములకు అన్నిటిని తెలియజెప్పునది ప్రజ్ఞానము. ఈ రెండును పరస్పరము అవినాభావ సంబంధము కలిగియున్నవి. ప్రజ్ఞానమే ఆత్మ, ఆత్మయే ప్రజ్ఞానము.

# 13

# నాదానుసంధాన ప్రకరణము

144. యావత్ క్షణం క్షణార్థం స్వరూప పరిచిన్తనం క్రియతే
తావద్ దక్షిణకర్ణే త్వనాహతః శ్రూయతే శబ్దః

తన నిజరూపము నాలో, చనగను క్షణమైనను నరక్షణమది యైనన్
వినిపించు ననాహతమన్ ధ్వని కుడిచెవిలోన నద్భుతమది తెలియన్

శ్రవణ, మనన, నిధిధ్యాస, సమాధులు ఆత్మానుసంధానమునకు మెట్లు. సమాధి దశ వచ్చినప్పుడు తన స్వరూపమే ఆత్మయని తెలిసి, అట్టి అనుభూతి కొరకు ప్రయత్నములో చిత్తమును ఏకాగ్రము చేసి, క్షణమైనను ఆత్మానుసంధానము చేసినయెడల కుడిచెవిలో ఈ అనాహతమనే ధ్వని వినిపిస్తుంది. ఈ ధ్వని ఏ ఇతర ప్రమేయమూ లేకుండా వస్తుంది.

145. సిద్ధారమ్భస్థిరతావిశ్రమవిశ్వాసబీజశుద్ధీనామ్
ఉపలక్షణం హి మనసః పరమం నాదానుసన్ధానమ్

అరయగ యోగసిద్ధి మొదలంటను నిల్కడగాంచె నంటకున్
విరతి గడించె నంటకును వేమఱు నమ్మిక పుట్టె నంటకున్
గురుతరబీజశుద్ధి యొనగూడిన దంటకు గూడ గుర్తగున్
నరుని యెడంద నప్పరమనాదము దా ననుసంధితమ్మయేన్

సమాధి యోగము సిద్ధించడం మొదలయినదనుటకునూ, వైరాగ్యము స్థిరపడినదనుటకునూ, తన జ్ఞానము సంశయరహితముగా, దృఢముగా ఉన్నదనుటకునూ,

రజస్తమో వాసనాబీజములు అంతరించినవనుటకునూ ఉప లక్షణమే, పరమమైన ఈ నాదానుసంధానము.

146. భేరీమృదఙ్గ శఙ్ఖాద్యాహతనాదే మనః క్షణం రమతే
కిం పునరనాహతేఽ స్మిన్మధురేఽ ఖణ్డితే స్వచ్ఛే

భేరులు మ్రోగినన్ జెవుల వింత మృదంగము మ్రోతసొచ్చినన్
జోరుగ శంఖమూదినను జొక్కును చిత్తము దా క్షణమ్మునన్
తీరుగ తేనెసోనలటు తేరి యనాహతనాదరాగ సం
చార మఖండమై విరిసెనా యటుపై నిక వైభవమేమనన్ వలెన్

తాత్పర్యము స్పష్టము

147. చిత్తం విషయోపరమాద్యథా యథా యాతి నైశ్చల్యమ్
వేణోరివ దీర్ఘతరస్తథా తథా శ్రూయతే నాదః

ఎట్టెటు చిత్తము విషయము పట్టెదలి వినిశ్చలత్వ పరిణతి గను నా
పట్టున వేణువునూదిన యట్టుల బహుదీర్ఘనాదమది వినిపించున్

మనస్సు విషయములయందలి అనురక్తిని నైశ్చల్యముతో కొద్దిగా వదిలించుకుంటూ ఉంటే వేణువు ఊదినట్లు ఈ నాదము ఇంకా దీర్ఘముగా వినిపిస్తుంది.

148. నాదాభ్యన్తర్వర్తి జ్యోతిర్యద్వర్తతే హి చిరమ్
తత్ర మనో లీనం చేత్ న పునః సంసారబన్ధాయ

ఆ నాదము లోలోనన్ గానంబబడు జ్యోతి చాల కాలమ్మచటన్
మానసము లీనమైన, న్నానా సంసారబంధనము గనడింకన్

తాత్పర్యము స్పష్టము

149. పరమానన్దానుభవాత్ సుచిరం నాదానుసంధానాత్
శ్రేష్ఠశ్చిత్తలయోఽయం సత్స్వన్యలయేష్వనేకేషు

ధరనెన్నో కల వమ్మనోలయ విధుల్ తర్కింప నయ్యన్నిటన్
వర మీ యున్న మనోలయ క్రియ కదున్ ప్రాశస్త్యమున్ గాంచెడిన్

పరమానంద రసానుభూతి వలనన్ నాదాను సంధాన ని
ర్భర నిత్యాభ్యసనమ్ముచేత నది సంపాద్యమ్ము దుర్భేద్యమున్

బ్రహ్మానందానుభవము వలన, చిరకాలము నాదానుసంధానము వలన కలుగు చిత్తలయము, మనోలయము అన్నిటిలోనూ శ్రేష్ఠము.

# 14

# మనోలయ ప్రకరణము

150. సంసారతాపతప్తం నానాయోనిభ్రమాత్ పరిశ్రాన్తమ్
లబ్ధ్వా పరమానన్దం న చలతి చేతః కదాపి క్వాపి

కర ముడికి భవాగ్నిన్ మును, నిరతము చెడదిరిగి యోని నికరములన్ ని
ర్భర పరమానన్ద రసోద్ధురమై యటమీద మనసు తూలద యెందున్

మొదట సంసారాగ్నికి తెగనుడికి అనేక యోనులందు తిరిగి (పుట్టుచు, గిట్టుచు) తుట్టతుదకు కేవల బ్రహ్మానందభరితమైన మీదట చిత్తము ఎందును దుందుడుకు పడదు.

151. అద్వైతానందభరాత్ కిమిదం కోఽహం చ కస్యాహమ్
ఇతి మంథరతాం యాతం యదా తదా మూర్ఛితం చేతః

నెమ్మన మద్వైతానంద మ్మతిభరమౌట మంథనముగను నీవి
శ్వమ్మెక్కడి దే నెవడన్ గమ్మత్తని మూర్ఛ మునిగి కదుసొమ్మసిలున్

అద్వైతానందము పొంది, అంటే మనస్సులో బాహ్యావృత్తులన్నీ సమసిపోయి, ఆత్మనే చేరుకుని, సుషుప్తిలో వలె అత్యన్తము విశ్రాన్తిని చెంది, తాను జీవుడను, పరమాత్మతో లీనమయి సుఖించి కూడా ఆ సంగతి తెలియక, మళ్ళీ ప్రపంచజ్ఞానం రాగానే, ఈ ప్రపంచం ఎట్లా వచ్చింది? నేను ఎవడను? ఎవరివాడను? అని కళవళపడి ఎటూ తేల్చుకోలేక పోయినప్పుడు మనస్సు ప్రవృత్తిని కోల్పోతుంది.

152. చిరతరమాత్మానన్దానుభవాత్ ఆత్మాకారం ప్రజాయతే చేతః
సరిదివ సాగరయాతా సముద్రభావం యాత్యుచ్చైః

చిరకా లాత్మానుభవ స్ఫురణన్ మది యాత్మరూపముంగను; నది సా
గరమునబడి తద్భావ స్ఫురణన్ జెలరేగి పొంగుచొప్పున నెపుడున్

సమాధి దశ కొంతతడవు సంప్రాప్తించిన తరువాత, ఆత్మానుభవములోని అలౌకికానన్దము అనుభవించిన పిమ్మట మనసు తానే ఆత్మగా స్ఫురణము పొంది, నదులు సముద్రములో బడి నదీత్వము పోయి సముద్రత్వము చెందినట్లు తన ప్రత్యేకతను మరచి పూర్ణత్వమును భావించుకొనును.

153. ఆత్మన్యనుప్రవిష్టం చిత్తం నాపేక్షతే పునర్విషయాన్
క్షీరాదుద్ధృతమాజ్యం యథా పునః క్షీరతాం న యాతీహ

చిత్తమది ఆత్మయందున, హత్తుకొనన్ గోరదిక ననర్థవిషయముల్
ఇత్తెఱగు నేయి విడివడి, ఎత్తెఱగునదైన పాలనెనయని యటులే

మనస్సు ఆత్మానందానుభవము యొక్క రుచి మరగి, ఆత్మలో లీనమై యున్నప్పుడు, క్షణికములగు విషయానన్దములను కోరుకొనదు. ఇది ఎట్లాగంటే పాలు కాచి తోడుపెట్టి, వెన్నతీసి, మరగపెట్టి తయారుచేసిన నేయి, మళ్లీ పాలల్లో వేసినా పాలతో కలయిక పొందనట్లే.

154. స్రష్టా ద్రష్టరి దృశ్యే యదనుస్యూతం చ భానమాత్రంస్యాత్
తత్రోపక్షీణం చేత్ చిత్తం తన్మూర్ఛితం భవతి

చూడబడునది, చూచుట, చూచునదియు త్రిపుటియనబడునివి జూచు తెలివి వేరు
ఇట్టి తెలివిని చిత్తమ్ము లీనమైన నపుడె మూర్ఛిల్లు చాంచల్యమటు త్యజించు.

మనస్సు ప్రపంచవిషయములను పరిశీలించుచున్నప్పుడు తాను ద్రష్టననియు, ఇంద్రియజ్ఞానము దృష్టియనియు, ప్రపంచములోని విషయము దృశ్యమనియు భావించుకొనును. ఇవే ద్వైతజ్ఞానములన్నిటిలోనూ తప్పనిసరియైన త్రిపుటి. యీ మూడింటిలో అనుస్యూతముగా, అంటే ఒకే విధంగా ఉన్నది సామాన్య జ్ఞానమే. అంటే తెలివి. ఈ తెలివి ద్రష్టలో తాను తెలుసుకుంటూ ఉన్నానీ, దృష్టిలో ఇంద్రియ జ్ఞానమనీ, దృశ్యములో వస్తుజ్ఞానమనీ మూడు విధములుగా ప్రవర్తిస్తుంది. ఈ చిత్తము భేదజ్ఞానములను మరచి,

అభేదజ్ఞాన స్వరూపమైన ఆత్మలో చేరుకుంటే ఆత్మలోనే లీనమైపోతుంది.

155. యాతి స్వసంముఖత్వం దృజ్మాత్రం వా యదా తదా భవతి
దృశ్యద్రష్టృ విభేదో హ్యసంముఖేఽ స్మిన్ న తత్ భవతి

మన సాత్మనుండి విడివడి, గను తననే దృశ్యమగు జగత్తుగ; తానే
వెనుదిరిగి యాత్మనెనసిన, జనునెటకో ద్రష్టృదృశ్య సంభావనయున్

మనస్సు జగత్తువైపు మరలితే తాను ద్రష్టననీ జగత్తు దృశ్యమనీ భావించు కుంటుంది. అల్లా కాకుండా, మనస్సు ఆత్మకు ఉన్ముఖమైతే మనస్సు ఆత్మలో విలీనమై, ఆత్మయే ద్రష్టగా మిగులును. ఆత్మ ద్రష్టృస్వరూపమైతే, జగత్తు మనఃకల్పితమైనందున ఆత్మయే ద్రష్టయు, దృశ్యముగానూ అవుతుంది.

156. ఏకస్మిన్ దృఙ్మాత్రే ద్రష్ట్రాదికం హి సముదేతి
త్రివిధం తస్మిన్ లీనే దృఙ్మాత్రం శిష్యతే పశ్చాత్

ఒక దృక్కే కలిగించును ప్రకటముగా ద్రష్టృ దృశ్యభావము దృష్టిన్
ఇక నీ మూటిని తనలోనికి చేర్చిన దృక్కె మిగులు నిజముగ తానై

ఆత్మ దృక్కు మాత్రమే అయినప్పుడు ఆత్మనుండియే ఈ త్రిపుటి సంభవించినది. అందువల్ల మనస్సు ద్రష్టగానూ, ఇంద్రియములు దృష్టిగానూ, ప్రపంచము దృశ్యముగానూ తెలియబడినది. మళ్ళీ ఈ త్రిపుటిని తనలోనికి చేర్చుకుంటే, మనస్సు, ఇంద్రియాలు, జగత్తూ అన్నీ ఆత్మయే అవుతుంది.

157. దర్పణతః ప్రాక్ పశ్చాదస్తి ముఖం ప్రతిముఖం తదాభాతి
ఆదర్శేఽపి చ నష్టే ముఖమస్తి ముఖే తథైవాత్మా

అద్దమున్న మొగము నటువైపు ప్రతిబింబ మగుపడునది లేక మొగమె మిగులు
ఆత్మయట్లె మనసు కావల జగమగు, నాత్మ యొకటె మిగులు నది లయింప

మనస్సు అద్దము వంటిది. ఆత్మ ఈ మనస్సు అనే అద్దములో ప్రతిబింబమైతే, జగత్తుగా తెలియబడుతుంది. మనస్సు అనే అద్దము ఆత్మలో లయమైపోతే జగత్తు కూడా ఆత్మగానే మిగిలిపోతుంది.

# 15

## ప్రబోధ ప్రకరణము

158. మాధుర్యం గుడపిణ్డేయత్ తస్యాంశకేఽ ణుమాత్రేఽ పి
ఏవం న హి పృథగ్ భావో గుడత్వమధురత్వయో రస్తి

బెల్లపు గడ్డన్ మధురిమ బెల్లపు పిసరునను నుండు వేరన రా దా
బెల్లమ్మును నా తీపియు నుల్లసిలున్ రెండు నవ్వి యొకటై యచటన్

తాత్పర్యము స్పష్టము

159. అథవా నభిన్నభావః కర్పూరామోదయోరేవమ్
ఆత్మస్వరూపమనసాం పుంసాం జగదాత్మతాం యాతి

కప్పురమున్ పరిమళము న్నప్పగిదిని వేరుగావు ఆత్మాకృతియై
యొప్పెడి మదిగలవానికి దప్పక జగమాత్మభావతన్ విలసిల్లున్

బెల్లము, తీపిని వలె, కర్పూరము, పరిమళము వేరుకావు. అట్లే ఎవని :
తానే ఆత్మననే భావము దృఢమవుతుందో, అతనికి ఈ జగత్తంతా మనోమయ
ఆత్మగానే తెలియబడుతుంది.

160. యద్ భావానుభవస్స్యాత్ నిద్రాదౌ జాగరస్యాన్తే
అన్తః స చేత్ స్థిరః స్యాత్ లభతే హి తదాద్వయానన్దమ్

గాఢనిద్రలోనికి చేరుకునేముందు మనస్సు బాహ్యప్రపంచమును వ
అట్లాగే పూర్తిగా మెళకువ కలిగే ముందు నిద్రలో మనస్సు లయమయి బా

దృష్టిలోనికి ప్రవేశించే ముందటి నిర్వికల్పస్థితి ఉంటుంది. ఈ నిర్వికల్పస్థితి మనస్సులో స్థిరమైనవానికి తురీయావస్థాస్థితి ప్రాప్తించి, నిద్రలోని అజ్ఞానానుభవం మినహాయించి అప్పటి ఆత్మానందానుభవం ప్రాప్తిస్తుంది. అదియే బ్రహ్మానందము.

161. అతిగమ్భీరే పారే జ్ఞానచిదానన్దసాగరే స్ఫారే
కర్మసమీరణతరలా, జీవతరంగావలిః స్ఫురతి

స్ఫార మ్మతిగంభీర మపారము చిత్సుఖ మహాబ్ధిపై జీవులు బల్
జోరుగ వీచెడి కర్మసమీరపు కెరటాలవోలె మెలగుదు రంతే

అత్యన్త స్వచ్ఛము, అత్యన్త గంభీరము, అపారము అయినదీ మహాసముద్రము. అనంతకోటి జీవరాశులు, విశేషజ్ఞానాలకు, విషయసౌఖ్యాలకూ ఆటపట్టు అయిన పరమాత్మ. ఈ పరమాత్మ ప్రతిరూపములే అయిన జీవులు తమ తమ జీవితాలు సౌఖ్యానుభవాలు తమ కర్మవాసనలు అనే వాయువులచేత కల్పించుకొని, కాలంచేత నియమితులై, క్షణభంగురములైన తరంగముల వలె ఈ పరమాత్మ అనే సముద్రములోని అంతర్భాగములుగా కొనసాగుతారు.

162. ఖరతరకరైః ప్రదీప్తైః ఖ్యుదితే చైతన్యతిగ్మాంశౌ
స్ఫురతి మృషైవ సమంతాత్ అనేకవిధ జీవమృగతృష్ణా

చైతన్యంబను భానుడు భూతలమున దీవ్ర కిరణముల దీపింపన్
నీ తీరుగ బహుజీవులు ఖ్యాతిన్ మృగతృష్ణవోలె గందురు వెలుచన్

చైతన్యమనే సూర్యుడు తన తీవ్ర కిరణములు నిర్జల ప్రదేశములందు ప్రసరిస్తే అనేకమంది జీవులు భ్రమాత్మకముగా తెలియబడుతారు, ఎడారిలో ఎండమావుల వలె.

163. అంతర్దృష్టిరదృష్టే, యస్మిన్ జగదిద మారాత్ పరిస్ఫురతి
దృష్టే యస్మిన్ సకృదపి విలీయతే క్వాప్యసద్రూపమ్

లోనేది గనక వెలినిది గానంబడు జగము మరల కనబడదింకన్
లోనేది గనుట నొకపరి, లీనంబై చనున దెటకొ లేనిదివలెనే

తనలోననే ఆత్మను చూడని మనస్సుకు ఈ జగత్తు ఉన్నట్లే స్ఫురిస్తుంది. మనస్సు గనుక ఆత్మను ఒకసారి దర్శిస్తే ఈ జగత్తు మనఃకల్పితమైనందున, మనస్సుతోనే ఆత్మలో లీనమైపోతుంది.

164. బాహ్యాభ్యన్తరపూర్ణః పరమానన్దార్ణవే నిమగ్నో యః
పరమాప్లుత ఇవ కలశో మహాహ్రదే జహ్నుకన్యాయాః

పరమానంద మహాసాగరమున మునిగిన యతండు గంగ మడువులో
కరమొలాడిన కలశపు స్ఫురణన్ లో వెలుపలన్ ప్రపూర్ణుండై యగున్

ఆత్మను దర్శించిన ధన్యుడు పరమానందమహాసాగరంలో మునిగి ఉంటాడు. అతడు గంగ మడువులో ముంచిన కలశమువలె, లోపల వెలుపల కూడా పరిపూర్ణుడై ఉంటాడు.

165. పూర్ణాత్ పూర్ణతరే పరాత్ పరతరేఽ ప్యజ్ఞాతపారే హరౌ
సంవిత్సారసుధార్ణవే విరహితే వీచీతరఙ్గాదిభిః
భాస్వత్కోటి వికాసితోజ్జ్వలదిగాకాశప్రకాశే పరే
స్వానన్దైకరసే నిమగ్న మనసాం న త్వం న చాహం జగత్

హరియన్ నిష్కల నిస్తరంగమగు నిత్యానంద సంవిత్ సుధా
కరమందున్ రవికోటి భాసిత దిశాకాశమ్మునన్ దాపరా
త్పరమున్ బూర్ణము కంటె పూర్ణమగునా బ్రహ్మామృతానందసా
గరమందున్ మునుగంగ లేదు జగమింకన్ నీవు లే నేనునున్

స్వాత్మానందమనే అమృతసముద్రములో ఓలలాడుచున్న మనస్సుకల బ్రహ్మజ్ఞానికి, నీవు, నేనూ, ఈ జగత్తు ఇవన్నీ పరమాత్మ భావములోనే కనుపిస్తారు కనుక వారిలో భేదం స్ఫురించదు. ఈ అమృతసముద్రమును వర్ణిస్తున్నారు. పరమాత్మయే శ్రీకృష్ణుడు. ఆయన సంపూర్ణముగా చేతనాచేతన ప్రపంచములో వ్యాపించి ఉన్నాడు. ఈ చేతనాచేతన ప్రపంచం బ్రహ్మలోకం నుండి స్థావరలోకం వరకు తెలియబడుతుంది. ఆయన వ్యాపకత్వములోని సంపూర్ణత్వము, ద్వైతభావనలో ఉన్న మనవంటివారికి తెలిసిన పూర్ణత్వమునకు మించి ఉంటుంది. ఇందులో ఒకదానికంటే మరి ఒకటి ఉత్కృష్టము అనే భావన ఉన్నవారికి ఉత్కృష్టత్వములో అది అవధి అని తెలియాలి. మానుషానందము మొదలుకొని బ్రహ్మానందము వరకు ఉన్న ఆనందములను అన్నిటినీ తనలోనే ఇముడ్చుకున్నందున ఈ సముద్రమునకు అవతలి ఒడ్డు తెలియబడదు. ఈ సముద్రము కర్మ నిర్మితములై, కాల నియన్త్రితములైన స్వల్ప ఆనందములనే అలలు లేనందున అత్యన్త ప్రశాన్తముగా ఉంటుంది. ఆనందమే కాదు ప్రకాశము కూడ కోటి సూర్యులు కలిసి

ప్రసరించే కాంతులు కంటే మించి ఉంటుంది. ప్రకాశమంటే విజ్ఞానము కనుక బ్రహ్మాదుల సర్వజ్ఞత్వము కంటే మించి ఉంటుంది.

# 16

# ద్విధాభక్తి ప్రకరణము

166. చిత్తే సత్త్వోత్పత్త్యా తటిదివ బోధోదయో భవతి
తత్త్వైవ స స్థిరః స్యాత్ యది చిత్తం శుద్ధి ముపయాతి

మనసున సత్త్వగుణము పొడమిన జ్ఞానోదయము మెఱపు మెఱసినయట్లౌ
మనసది చక్కగ శుద్ధిం గనినప్పుడు జ్ఞాన మదియు గట్టిగ నిలుచున్

మనస్సు అనేది సత్త్వ, రజ స్తమోగుణముల కలయిక. రజస్తమో గుణములు సత్త్వగుణము కంటె ప్రబలముగా ఉన్నప్పుడు స్వార్థబుద్ధి, పాపబుద్ధి పుట్టుతూ ఉంటాయి. తాను చేసిన పుణ్యమువల్ల రజస్తమో గుణముల ప్రాబల్యము క్షీణించి సత్త్వగుణము ఎక్కువగా ఉద్భవించిన సమయములో పరమాత్మ ప్రతిబింబము మనస్సులోని సత్త్వగుణమునందు గోచరిస్తుంది. పరమాత్మ అంటే జ్ఞానమే కనుక ఈ జ్ఞానము, మనస్సులోని రజస్తమో గుణములను మరికొంచెము క్షీణింపజేస్తుంది. అంటే మనస్సును శుద్ధిపరుస్తుంది. ఈ విధముగా జ్ఞానవృద్ధి, సత్త్వవృద్ధి సమానాంతరముగా సంభవించి, క్రమముగా చిత్తమునందు రజస్తమో గుణములను బాగా శుద్ధి చేస్తుంది.

167. శుద్ధ్యతి హి నాన్తరాత్మా కృష్ణపదామ్భోజభక్తిమృతే
వసనమివ క్షారోదైర్భక్త్యా ప్రక్షాల్యతే చేతః

హరిచరణకమల భక్తి, స్ఫురణంగా కంతరాత్మ శుద్ధిం గన దం
బర ముప్పునీట బలె నా, హరిభక్తిం మనస్సు మకిలి యది కడుగబడున్

శ్రీకృష్ణుని విగ్రహము శుద్ధ సత్త్వమయము. ఆయన పాదములను శరణొంది

హృదయములో ఆరాధిస్తే మనస్సులోని రజస్తమోగుణ వాసనలు క్షీణిస్తాయి. అంతరాత్మను శుద్ధి చేయడానికి మానవులకు హరిభక్తిని మించిన సాధనము లేదు. వస్త్రములో మకిలి ఉంటే నీటిలో సోడా ఉప్పు వేసి ఉతికినట్లే, మనస్సులో హరిభక్తి మేళవిస్తే మనసులోని ధూళి కి వదిలిపోతుంది.

168. యద్వద్విమలాదర్శే సుచిరం భస్మాదినా శుద్ధే
ప్రతిఫలతి వక్త్ర ముచ్చైః శుద్ధే చిత్తే తథా జ్ఞానమ్

**మాసిన యద్దము బూదింబూసి కదుం దోమ దోమ మొగమందట్లే**
**భాసిలు జ్ఞానము మలిమిం బాసిన చిత్తమ్మునందె పరిపూర్ణ దశన్**

మనస్సు పరమాత్మ ప్రతిబింబమును ప్రతిగ్రహించే అద్దము వంటిది. అద్దమునకు మకిలి పట్టినట్లే, మనస్సుకు రజస్తమో గుణోద్రేకము అను మకిలి పట్టుతూ ఉంటుంది. హరిభక్తివలన మనస్సులోని మాలిన్యము శుద్ధి పొందిన తర్వాత, పరమాత్మ ప్రతిబింబము అనగా జ్ఞానము మనస్సులో స్ఫుటము అవుతుంది. భక్తి, జ్ఞానములు పరస్పర సహకారకములు.

169. జానన్తు తత్ర బీజం హరిభక్త్యా జ్ఞానినో యే స్యుః
మూర్తం చైవామూర్తం ద్వే ఏవ బ్రహ్మణో రూపే

**హరిభక్తి నెఱుకబడయుట, కరయన్‌వలె రెండు బ్రహ్మకగు రూపమ్ముల్**
**హరిరూపము మూర్తమ్మును, పరమాత్మ యమూర్తమగుచు బరగెడు విధమున్**

హరిభక్తి వలననే జ్ఞానులై తరించినవారు బీజభూతమగు నొక విషయము తెలిసికొనిరి. అది యేదంటే బ్రహ్మమునకు రెండు రూపములున్నాయనీ, అందులో ఒకటి మూర్తిమంతమై ఉంటుందనీ, మరియొకటి యెట్టి మూర్తిని ప్రకటింపక నిరాకారముగా ఉంటుందనీ, అదే పరమాత్మయనీ.

170. ఇత్యుపనిషత్తయోర్వాద్వౌ భక్తౌ భగవదుపదిష్టే
క్లేశాదక్లేశాద్వా ముక్తిః స్యాదేతయోర్మధ్యే

**అనె నుపనిషత్తు, భగవంతునిచే నుపదిష్టమయ్యెనున్ భక్తులు రెం**
**డని యత్రమమున సిద్ధిం, గనునొక్కటి క్లేశయుక్తగతి మరియొకటిన్**

ఉపనిషత్తు చెప్పడమే కాక, భగవంతునిచేత భక్తియోగము వివరించునప్పుడు, నిత్యయుక్తులై తనయందే మనస్సును అర్పించి ఉపాసించే భక్తులు తన స్వరూపమును ధ్యానించుటచేత సులభముగా తనను ప్రాప్తిస్తారనీ, అట్లా కాకుండా అక్షరము, అనిర్దేశ్యము, అవ్యక్తము అయిన పరమాత్మ స్వరూపమును ఉపాసించేవారు కూడా తననే చేరుకుంటారనీ, అయితే వారి దారిలో క్లేశము అధికతరమనీ చెప్పినాడు.

171. స్థూలా సూక్ష్మా చేతి ద్వేధా హరిభక్తిరుద్దిష్టా
ప్రారమ్భే స్థూలా స్యాత్ సూక్ష్మా తస్యాః సకాశాచ్చ

**స్థూలము సూక్ష్మమనగా, గ్రాలున్ హరిభక్తి రెండుగా నట మొదటన్**
**స్థూలమగు భక్తి కలిగిన, నాలోపల సూక్ష్మభక్తి యారంభమగున్**

హరిభక్తి పరిణతి చెందుటకు రెండు మెట్లున్నవి. వానిలో మొదటి మెట్టు స్థూల భక్తి. రెండవ మెట్టు స్థూలభక్తిచే వృద్ధిచెంది పరిణతి చెందిన సూక్ష్మభక్తి.

172. స్వాశ్రమధర్మాచరణం కృష్ణప్రతిమార్చనో నిత్యమ్
వివిధోపచారకరణైః హరిదాసైః సంగమః శశ్వత్
173. కృష్ణ కథాసంశ్రవణోత్సాహః సత్యవాదశ్చ
పరయువతౌ ద్రవిణేవా పరాపవాదే పరాఙ్ముఖతా
174. గ్రామ్యకథాసూద్వేగః సుతీర్థగమనేషు తాత్పర్యమ్
యదుపతికథావియోగే వ్యర్థం గతమాయురితి చిన్తా
175. ఏవంకుర్వతి భక్తిం కృష్ణకథానుగ్రహోత్పన్నా
సముదేతి సూక్ష్మభక్తిర్యస్యాం హరిరన్తరావిశతి

స్వాశ్రమ ధర్మంబులాచరించుట కృష్ణ ప్రతిమార్చనోత్సవపరత గనుట
వివిధోపచార సద్విధి హరిదాసులౌ జనముతో నిత్యమ్ము సంగతియును
హరికథా శ్రవణోత్సవాసక్తి సత్యోక్తి పరధన దారాపవాద విరతి
గ్రామ్యకథల్ విన కడు మనఃక్లేశమ్ము తీర్థాటనమున సంతృప్తిగనుట

తే॥ కృష్ణ కథలెడమైనచో కించపడుట నాయువిటు వ్యర్థమయ్యెనోయనుచు దిగులు
ఇటులనే స్థూల భక్తి వర్తింప నపుడు దాన కలుగును కృష్ణ కథానురాగ
సంభృతానన్దజనిత సూక్ష్మస్వరూపమైన భక్తియే నందు శ్రీహరియు జే



ప్రబో

స్థూలభక్తి యొనరించుటలోని విధులు చెప్తున్నారు. మొదటిది తన వర్ణాశ్రమ ధర్మమును నియమముతో నిర్వహించుట. రెండవది శ్రీకృష్ణ ప్రతిమను ఆరాధించుటలో వివిధ ఉపచారములతో అనగా ఆవాహనము, అభిషేకము, ధూపదీప నైవేద్యములతో షోడశోపచారములతో, సంగీత సాహిత్య సేవలను అర్పించుటలో ఉత్సాహము. హరిభక్తులైనవారితో సమావేశమునందు తత్పరత. శ్రీకృష్ణలీలలు, ఆయన కారుణ్యము, ఆర్తత్రాణ పరాయణత్వము తెలుపు కథలు వినుటలో ఆసక్తి. నిరంతర సత్య పరాయణత్వము, పరధనమును, పరయువతులను, పరాపవాదమును విరక్తితో పరిహరించుట. గ్రామ్య కథలు అనగా గ్రామ్యసుఖములను, గ్రామ్య క్రీడలను తెలుపు కామక్రోధాత్మకములైన కథలు పరిహరించుట, ఒకవేళ వినవలసినచో మనఃక్లేశము చెందుట. మథుర, ద్వారక, బృందావనము, గురువాయూరు మొదలైన కృష్ణ క్షేత్ర దర్శనములో, భగవదారాధనలో ధన్యత్వమును భావించుకొనుట. కృష్ణ కథాశ్రవణము నందు విఘ్నములు కలిగినప్పుడు కించపడి, అట్టి విఘ్నములను నిరోధించు ప్రయత్నము చేయుట. అట్టి శ్రవణము లేని సమయమంతా తన ఆయువును వ్యర్థము చేయుటయే అను చింత. ఈ విధముగా స్థూలభక్తితో శ్రీకృష్ణుని కొంతకాలము ఆరాధించినచో, ఆ భక్తుని హృదయమందు కృష్ణకథాస్వాదనమునందలి స్వారస్యము నిలిచిపోయి సూక్ష్మభక్తి ఉదయిస్తుంది. అట్టి భక్తి కలిగిన హృదయమునందు శ్రీకృష్ణుడు ప్రవేశించి ఆతనిని క్రమక్రమముగా తన వద్దకు ఆకర్షించుకొనును. అట్టి భక్తులను త్వరలోనే మృత్యు సంసారసాగరమునుండి ఉద్ధరిస్తానని భగవంతుని వాగ్దానము.

176. స్మృతిసత్పురాణవాక్యైర్యథా శ్రుతాయాం హరేర్మూర్తౌ
మానసపూజాభ్యాసో విజననివాసేఽపి తాత్పర్యమ్

177. సత్యం సమస్త జంతుషు కృష్ణస్యావస్థితేరాఽనమ్
అద్రోహో భూతగణే తతస్తు భూతానుకమ్పా స్యాత్

178. ప్రమితయదృచ్ఛాలాభే సంతుష్టిర్దారపుత్రాదౌ
మమతాశూన్యత్వమతో నిరహంకారత్వ మక్రోధః

179. మృదుభాషితా ప్రసాదో నిజనిన్దాయాం స్తుతౌ సమతా
సుఖదుఃఖశీతోష్ణ ద్వన్ద్వసహిష్ణుత్వ మాపదో న భయమ్

180. నిద్రాహారవిహారేష్వనాదరః సఙ్గరాహిత్యమ్
వచనే చానవకాశః కృష్ణస్మరణేన శాశ్వతీ శాన్తిః

**స్మృతి పురాణమ్ములన్ శ్రుతమైన హరిమూర్తి యందు మానసిక పూజాభ్యసనము**
**ఏకాంతవాసమం దిచ్ఛయే ప్రాణిలో కృష్ణుడున్నాడన్న యెఱుక గనుట**
**భూతమ్ములన్ ద్రోహబుద్ధి లేకుండుట దాన నఖిలభూతదయయు గనుట**
**ప్రాప్తించు కొలది లాభమున సంతోషమున్ భార్యాదులందు మమత్వరహిత**
**చిత్తము, నక్రోధసిద్ధి, యహంభావ రాహిత్యమున్ వాక్కులను మృదుత్వ**
**మాత్మ సంతృప్తి, నిందాస్తుతుల సమత, సుఖదుఃఖ శీతోష్ణ సుసహనమ్ము**

**ఆపదలు వచ్చి పడెనేని యడలకునికి నిదురకాహార సుఖములకెదురుచూపు**
**మౌన, మనృత విషయములన్ మమతలేమి, శాంతి నిత్యము కృష్ణ సంస్మరణమునను**

సూక్ష్మభక్తి స్వరూపమును వివరిస్తూ ఉన్నారు. భగవద్గీత ద్వాదశాధ్యాయములో మూర్తియందలి భక్తిని, అమూర్త పరమాత్మయందలి భక్తిని నిర్వచించి, భక్తియోగ సమాహారముగా చెప్పినదే ఇంచుమించు సూక్ష్మభక్తి నిరూపణము. దీని లక్షణములివి. స్మృతులలోనూ, పురాణములలోనూ భగవానుని మూర్తిని ఎట్టి వాక్యములలో వర్ణించినారో, అట్టి విధముగా మనస్సులో సన్నిధి కల్పించుకొని, ఆరాధించుటను క్రమక్రమముగా అభ్యసించుట. జనబాహుళ్యమునకు దూరముగా, ఏకాంతవాసములో తత్పరత. సమస్త జంతువులలోని అంతర్యామిగా శ్రీకృష్ణుడున్నాడనే సత్యజ్ఞానమునందు నిశ్చయము. సమస్త భూతములయందున్న అంతరాత్మయు, తన అంతరాత్మయు, శ్రీకృష్ణుని కంటె వేరుకాదనే దృఢనిశ్చయముతో ఎట్టి భూతమునకు ద్రోహము తలపెట్టకయుండుట. సర్వభూతములయందును దయ కలిగియుండుట. ఏ కొంచెము సంప్రాప్తమైనను సంతోషించుట. భార్యాపుత్రులయందు మమతారాహిత్యము, ఎన్నో జన్మలలో వారి వియోగము తప్పనిసరిగా అనుభవించినందున క్షణికమైన కోపమును దీర్ఘ క్రోధముగా మార్పుజెందనీయక యుండుట. అన్ని సంఘటనలూ ఈశ్వర ప్రేరితములైనందున, నేనే కర్తను అని అహంకారమును త్యజించుట. మృదుభాషిత్వము, నిందాస్తుతుల యందు తుల్యభావన, శీతోష్ణ సుఖదుఃఖములందు సమానమైన సహనము, ఆపదలందు దృఢమైన మనఃస్థైర్యము, నిద్రాహార విహారములలో ఔత్సుక్యము లేని నిరాదరణ, ప్రాపంచిక విషయముల వలన కాలనియంత్రిత సుఖములే వస్తాయి గనుక వాటితో మానసిక సంగము లేకుండుట, శ్రీకృష్ణుని సంస్మరణములో మనస్సుకు ప్రశాంతి కలుగుట.

181. కేనాపి గీయమానే హరిగీతే వేణునాదే వా
ఆనన్దావిర్భావో యుగపత్ స్యాత్ దృష్టసాత్త్వికోద్రేకః

**హరిగీతము నెవడేనిన్, కరమర్థిన్ బాడ వేణునాదము విన్నన్**
**పరమానందోదయనిర్భరసత్త్వోద్రేకవృత్తి పరవశతగనున్**

అప్పటికి మనస్సు కృష్ణభావితమైనందున, ఎవ్వడు కృష్ణుని నిర్హేతుకజాయమాన కటాక్షవీక్షణమును, పరమదయాపరత్వమును, ఆర్తత్రాణపరాయణత్వమును వర్ణించు గానము చేసిననూ, ఈ గానమును గాత్రముచే గాక వేణుగానముగా వినిపించినను, ఆ మనస్సులో సాత్త్విక భావములు ఉద్రేకము చెంది, శరీరము పరవశించి, కన్నులలో ఆనందభాష్పములు నిండి, పరమానందరసానుభూతిని కలిగించును. ఇదియే సూక్ష్మభక్తి కలిగినదనుటకు చిహ్నము.

182. తస్మిన్ననుభవతి మనః ప్రగృహ్యమాణం పరాత్మసుఖమ్
స్థిరతాం యాతే తస్మిన్ యాతి మదోన్మత్తదంతిదశాం

**అనుభవమిది గని మదియా అనుపమ పరమాత్మ సుఖము నందుకొనుటలో**
**గని స్థిరతన్ హరిభక్తిన్, దనరు మదోన్మత్త దంతిదశ పరవశమై**

ఇట్టి భక్త్యావేశమును అనుభవించి, ఆ భక్త్యావేశములోనే తనయందే నిలచియున్న శ్రీకృష్ణుని పరమానంద స్వరూపములోనే మనస్సు లయింపగా హరిభక్తిలో స్థిరత్వమును పొందును. అట్టి స్థితిలో వాని మనస్సు బాహ్యమును పూర్తిగా విస్మరించి, శ్రీకృష్ణ రూప, గుణ ధ్యానమే తన స్వరూపము కాగా, మదోన్మత్త దంతి దశకు చేరుకొనును. మదోన్మత్తమైన ఏనుగు మావటివానికి అధీనమై యుండే స్వభావమును మరచి బాహ్య ప్రపంచమంతయునూ తనకే స్వాధీనమైనట్లు ప్రవర్తించును. ఇది గోపికాజనమునందలి కృష్ణభక్తిలో వ్యక్తమైనది. వారు నరులనైనను, తరులనైనను, ఇతర గోపికలనైనను కృష్ణభావముతోనే చూచి అట్లే ప్రవర్తించినారు. అందులకే నారద మహాముని తన భక్తి సూత్రములలో గోపికల భక్తియే పరమభక్తికి పరమావధియని చెప్పినాడు. ఉద్ధవుడు ఆ గోపికల పాదరేణువులకు మాటిమాటికి నమస్కరించినాడు.

వివరణ: గోపికల భక్తి యొక్క ఉత్కృష్టతను గురించి శ్రీకృష్ణుడే స్వయంగా ఉద్ధవునితో చెప్పినాడు. (భాగవతము, ఏకాదశ స్కంధము, ద్వాదశాధ్యాయము శ్లోకసంఖ్య 12, 13, 14, 15)

తా నావిదః మయ్యనుషంగబద్ధధియః, స్వమాత్మానమదస్తథేదం
యథా సమాధౌ మునయో౽బ్ధితోయే నద్యః ప్రవిష్టా ఇవ నామరూపే (12)

మత్కామా రమణం జారం మత్స్వరూప విదో౽బలాః
బ్రహ్మ మా యపరం ప్రాపుః సంగాత్ శతసహస్రశః (13)

తస్మాత్ త్వముద్ధ వోత్సృజ్య చోదనాం ప్రతిచోదనామ్
ప్రవృత్తించ నివృత్తించ శ్రోతవ్యం శ్రుతమేవ చ (14)

మామేకమేవ శరణమ్ ఆత్మానం సర్వదేహినామ్
యాహి సర్వాత్మభావేన మయా స్యా హ్యకుతోభయమ్ (15)

ఆ గోపికలు నాయందు నెలకొనియున్న బుద్ధి కలవారై తమను తామే తెలియలేదు. అంతేకాదు, దగ్గరవిగాని, దూరపువిగాని యే వస్తువులూ వారికి నాకంటే వేరుగా తెలియలేదు. ఇది ఎట్లాగంటే మునులు సమాధిలో మునిగిపోయినట్టు, నదులు సముద్రములో కలిసిపోగా, తమ నామరూపములలోని భేదము సమసిపోయినట్లు (12).

నన్నే సర్వాత్మనా కోరుకొని, సచ్చిదానందస్వరూపుడనైన నన్నే సుఖప్రదాతగా, జారునిగా భావించుకొని, నా నిజస్వరూపము తెలియకపోయినప్పటికి బ్రహ్మమునైన నన్నే సమస్త ద్వైత భావనలను మరచి ప్రాప్తించినారు. (13)

అందుచేత ఓ ఉద్ధవా! నీవు కూడా ద్విత్వభ్రాన్తి రూపములైన విధి నిషేధములనూ, ప్రవృత్తి నివృత్తి మార్గములనూ వదలివేసి సర్వజీవులకు అంతరాత్మ స్వరూపుడనైన నన్నే శరణందుము. నీవు, నేను, ఈ జగత్తూ అన్నీ ఆత్మస్వరూపములే అని భావించి నన్నే శరణందితే నా వల్లనే నీవు అన్ని భయస్థానములనుండి విముక్తి పొందుతావు, "ద్వితీయాద్వైభయా భవతి" అని వేదం చెప్పినందున అఖండానంద స్వరూపుడనైన నన్ను చేరుకొని ముక్తుడవు అవుతావు.

183. జన్తుషు భగవద్భావం భగవతి భూతాని పశ్యతి క్రమశః
ఏతాదృశీ దశాత్తనైవ హరిదాస వర్యః స్యాత్

**భగవద్భావము ప్రాణుల భగవంతునియందు నెల్ల ప్రాణుల గను మె**
**ల్లగ నీ విధమగు దశయే యగు నా హరిదాసవర్యు దాతందు యగున్**

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని, ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః" అని శ్రీకృష్ణుని నిర్వచనం. (భ.గీ 6-29). భక్తియోగమునందు పరినిష్ఠితుడై, తనలోనే భగవంతుని భావించుకొని సర్వత్ర భగవంతుని తన ఆత్మస్వరూపుని దర్శిస్తే, బ్రహ్మానందమును అనుభవిస్తాడని ఆయన చెప్పినదే. "యోమాంపశ్యతి సర్వత్ర సర్వంచమయిపశ్యతి, తస్యాహం న ప్రణశ్యామి, స చ మే న ప్రణశ్యతి" (భ.గీ. 6-30). నన్నే సర్వత్ర ఎవడు చూస్తాడో, వానికి నాలోనే సర్వము దర్శనమవుతుంది. అతనికినీ, నాకునూ సాన్నిహిత్యము ఎప్పటికీ నశించదు అని శ్రీకృష్ణవచనం.

# 17

# ధ్యానవిధి ప్రకరణము

184. యమునాతటనికటస్థితబృన్దావనకాననే మహారమ్యే
 కల్పద్రుమతలభూమౌ చరణం చరణోపరిప్రతిష్ఠాప్య

 **యమునా తట నికటస్థిత సుమధుర బృందావనాగ్ర శోభిత కల్ప**
 **ద్రుమతల భూమిన్ జరణాబ్జమునొక్కట నొకటి యూన్చి వర్తిలువానిన్**

యమునాతీర ప్రాంతమునందున్న బృందావన సుందరవనములో, కల్పవృక్షము క్రింద, నొక పాదముపై నింకొక పాదమును ఆనించియున్న శ్రీకృష్ణమూర్తిని ధ్యాన మందు నిల్పుకోవలెను.

185. తిష్ఠన్తం ఘననీలం స్వతేజసా భాసయన్త మిహ విశ్వమ్
 పీతామ్బరపరిధానం చన్దనకర్పూరలిప్త సర్వాఙ్గమ్

 **జలధరనీలున్ విశ్వము వెలిగించెడి వెలుగువాని పీతాంబరు సు**
 **జ్జ్వలచందన కర్పూర, ప్రలిప్త సర్వాంగు భక్తవర సన్నిహితున్**

నీలమేఘశరీరుని, తన తేజముచేత సకల ప్రపంచమును భాసింపజేయువానిని, పీతాంబరధారిని, మంచిగంధము, పచ్చకర్పూరము మొదలగు పరిమళ ద్రవ్యములు మేనబూసికొన్నవానిని, భక్తవరులకు ఎల్లప్పుడు సన్నిహితుడైన శ్రీకష్ణమూర్తిని ధ్యానింపవలెను.

186. ఆకర్ణపూర్ణనేత్రం కుణ్డలయుగమణ్డితశ్రవణమ్
మన్దస్మితముఖకమలం సుకౌస్తుభోదారమణిహారమ్

**ఆకర్ణ పూర్ణనేత్రున్ బ్రాకటమణికుండల స్ఫురత్కర్ణయుగున్**
**స్తోకస్మిత ముఖకమలున్, శ్రీకౌస్తుభరత్నహారు శ్రితమన్దారున్**

ఆకర్ణాంత విశాలనయనుని, కుండల యుగముతో నలంకృతమైన చెవులు కలవానిని, చిరునవ్వులు చిందించు ముఖకమలము కలవానిని, శ్రీకౌస్తుభమణితో కలసిన రత్నహారాలంకృతుని, ఆశ్రితులపాలిటి కల్పవృక్షమైన శ్రీకృష్ణమూర్తిని ధ్యానింపవలెను.

187. వలయాఙ్గులీయకాద్యానుజ్జ్వల యన్తం స్వలంకారాన్
గలవిలులితవనమాలం స్వతేజసాఽపాస్తకలికాలమ్

**వలయాంగులీయకాది సకలభూషణ భూషణున్ జగత్తోషణునిన్**
**గలవిలులిత వనమాలా కలితున్ స్వద్యుతి నిరస్త కలిదుష్కాలున్**

కంకణములు, ఉంగరములు మొదలయిన తన భూషణముల కాంతిని తన మేనికాంతిచేత ఇనుమడింపజేయువానిని, మెడలో నూగులాడుచున్న వనమాల కలవానిని, తన తేజముతోనే కలిదుష్కాలమును అరికట్టేవానిని శ్రీకృష్ణమూర్తిని ధ్యానించునది.

188. గుఞ్జారవాలికలితం గుఞ్జాపుఞ్జాన్వితే శిరసి
భుఞ్జానం సహ గోపైః కుఞ్జాన్తరవర్తినం హరిం స్మరత

**గుంజాలంకృత మౌళిన్ గుంజించుచు తేట్లు ముసరుకొన గోపులతో**
**రంజిలి చలుదులు తిని సుమకుంజములన్ మసలు హరిని గోరి తలచుతన్**

గురువింద పూసల పేరులను శిరమున జుట్టుకొన్నవానిని, ఝుమ్మని గుంజించు తుమ్మెదలు ముసురుకొను పరిమళితమైన ముఖము కలవానిని, గోపకులతో చలుదులు గుడిచి, పూపొదరిండ్లలో చరించువానిని శ్రీకృష్ణమూర్తిని స్మరింపవలెను.

189. మన్దారపుష్పవాసితమన్దానిలసేవితం పరానన్దమ్
మన్దాకినీయుతపదం నమత మహానన్దదం మహాపురుషమ్

**మన్దారపుష్పసౌరభమందిన మందానిలము లల్లన వీవన్**
**మన్దాకినిగల చరణు నమన్దానందమ్మునిచ్చు మహిమాన్వితునిన్**

మందార పుష్పముల పరిమళములను అలదుకొని వచ్చిన మందమారుతము ప్రసరించుచుండగా, పాదములందు మన్దాకిని సంభవించిన మహిమాన్వితుడైన శ్రీకృష్ణమూర్తిని అమందానందప్రదుని స్మరించవలెను.

190. సురభీకృతదిగ్వలయం, సురభిశతైరావృతం పరితః
సురభీతిక్షపణమహాసురభీమం యాదవం నమత

సురభీకృత దిగ్వలయున్ సురభీతిహరుని గొలుతు మసురభీకరునిన్
సురభిశతావృతునిన్ సుర, సురభికృత పయోభిషేక శోభిత గాత్రున్

తన మేని సువాసనలచేత దిశలెల్ల పరిమళింపజేయువానిని, వందల కొలది గోవులు తన చుట్టును చేరి ఉన్నవానిని, సురల భయమును వదిలించువానిని, అసురులకు భీతికొలుపువానిని, దేవలోకమునుండి వచ్చి కామధేనువు తన పాలతో అభిషేకము సేయగా, శోభలు కొలుపు తనువు కలవానిని, (గోవర్ధనోద్ధరణము తరువాత కామధేనువు తన పాలతో గోవింద పట్టాభిషేకమును, బ్రహ్మయానతిని చేసినది) శ్రీకృష్ణమూర్తికి నమస్కరించి ధ్యానింపవలెను.

191. కన్దర్పకోటి సుభగం వాంఛిత ఫలదం దయార్ణవం కృష్ణమ్
త్యక్త్వాఽ కమన్యవిషయం నేత్రయుగం ద్రష్టు ముత్సహతే

కందర్పకోటి సుందరు, నందరి కోరికలొసగు దయార్ణవునిన్గా
కెందైన కన్నులుత్సవమందునె శ్రీకృష్ణమూర్తి యందే నిలచున్

కోటి మన్మథ సౌందర్యశాలియు, అందరికీ అన్ని కోరికలూ ఇచ్చే దయా సముద్రుడునూ అయిన శ్రీకృష్ణునియందు గాక నింకెందునైనా కన్నులకు పండువ ఔతుందా?

192. పుణ్యతమా మతిసరసాం మనోఽ భిరామాం హరేః కథాంత్యక్త్వా
శ్రోతుం శ్రవణద్వన్ద్వం గ్రామ్యం కథమాదరం భవతి

పావనతమ మతిసరసము భావమధురమచ్యుత ప్రబంధము వినకిం
కీ వీనులు గ్రామ్యములగు నా వార్తలు వినగనేల యభిలాషపడున్

మనస్సును అత్యన్తము పవిత్రీకరించేదీ, మిక్కిలి రసభరితమైనదీ, మధురమైన కృష్ణప్రీతి భావనలను కలిగించేదీ అయిన శ్రీకృష్ణ లీలా ప్రబంధము గాక కామ, క్రోధ, మద, మాత్సర్య సంశ్రితములైన ప్రపంచ విషయములను విపులీకరించు గ్రామ్య కథలను వినుటకు ఈ రెండు శ్రవణేంద్రియములకు కోరిక కలుగుతుందా?

193. దౌర్భాగ్యమిన్ద్రియాణాం కృష్ణే విషయే హి శాశ్వతే
క్షణికేషు పాపకరణేష్వపి సజ్జన్తే యదన్యవిషయేషు

తమకు కృష్ణుండు శాశ్వత ధ్యాన విషయు డగుచు లోపల నివసింప నఘములీను క్షణిక విషయాభిగమన మక్షగణమునకు పరమ దౌర్భాగ్యమని వేర పలుకవలెనె?

సమస్త జీవులకు అంతర్యామిగా చైతన్యప్రదాతగా శ్రీకృష్ణుడు వాసుదేవుడై, నిరంతరము తమలోనే నివసిస్తూ ఉన్నాగాని, అశాశ్వతములైన విషయ సుఖముల నాశించి అంతర్యామికి విముఖములై బాహ్య విషయములకు, క్షణిక మాత్ర సౌఖ్యములనిచ్చువానికి సుముఖములై పరుగెత్తుట, ఇంద్రియ గణము యొక్క దౌర్భాగ్యమని వేరే చెప్పవలెనా?

# 18

# సగుణ నిర్గుణయోరైక్య ప్రకరణము

194. శ్రుతిభిర్మహాపురాణైః సగుణగుణాతీతయోరైక్యమ్
యత్ ప్రోక్తం గూఢతయా తదహం వక్ష్యేఽతివిశదార్థమ్

**శ్రుతులున్ మహాపురాణము లతి గూఢము సగుణ నిర్గుణైక్యము చెప్పెన్**
**అతిసూక్ష్మ మయ్యర్థము నతివిశదమ్మగుట కేను నభివర్ణింతున్**

సగుణము (ఈశ్వరోపాధియుక్తము), నిర్గుణము (ఉపాధిరహితము, పరమాత్మ స్వరూపము) అని రెండు విధములుగా పరమాత్మ తత్త్వమును శ్రుతులును, మహాపురాణములును గూఢముగా చెప్పినవి. ఇది బాగుగా స్పష్టమగుటకు నేను వివరిస్తున్నాను.

195. భూతేష్వన్తర్యామీ జ్ఞానమయః సచ్చిదానన్దః
ప్రకృతేః పరః పరాత్మా యదుకులతిలకః స ఏ వాయం

**అఖిల భూతజాలమందు లో నెలకొని, జ్ఞానమయత నిత్యసౌఖ్యమయత**
**ప్రకృతి చేష్టలన్ని పరికించు సాక్షియౌ యదుపతియె పరాత్ముడతడె బ్రహ్మ**

సమస్త భూతములయందు అంతర్యామిగా నివసిస్తూ, జ్ఞానమే స్వరూపమై, నిత్యమైన ఆనందమే స్వరూపమై యుండి, ప్రకృతి (ప్రకృతి అనగా పరమాత్మను ఇంద్రియగోచరునిగా చేసి ప్రకటించేది) చేష్టలు, అంటే జీవుల ప్రవర్తనమును, పంచ భూతముల యొక్క ప్రవృత్తిని సాక్షిగా శాసకునిగా పరికించే పరమాత్మనే పరబ్రహ్మమంటారు. ఆయనయే యదుకుల తిలకుడైన శ్రీకృష్ణభగవానుడు.

196. నను సగుణో దృశ్యతను స్థధైకదేశాధివాసశ్చ
    న కథం భవేత్ పరాత్మా, ప్రాకృతవత్ రాగరోషయుతః

**త్రిగుణసంకలితుడును సంద్పృశ్యతనుడు ఇతర జనులట్ల రాగసంయుతుడు రోష యుక్తుడగు యదునాయకుడుండు నొక్క యెడనె, పరమాత్ము డీత డనుటెట్లు కలుగు**

శ్రీకృష్ణుడు కనుపించే శరీరము కలవాడు. అనేక గుణములు కలవాడేగాని నిర్గుణుడు గాడు. సామాన్య జనులవలె కొంతమందియందు అనురాగము కొంతమంది యందు రోషము చూపించేవాడే. పైగా ఒకానొక చోటనే నివసించినవాడు. ఈతడు పరమాత్మయనుట ఎట్లా చెల్లుతుంది?

వివరణ:

**శుద్ధసత్త్వమె దేహవిస్ఫురణజేయు, ఈశుని యుపాధి మాయయే యెపుడు; నితడు,**
**రాగరోషమ్ములూనుట వేగిరించు కొరకు జీవుల ముక్తి సంసరణ మాన్పి**
**ఒక్కయెడనున్న శ్రీకృష్ణుడుండలేడె? యెల్ల జగముల పరమాత్ముడే యతండు!**

197. ఇతరే దృశ్యపదార్థా లక్ష్యంతేఽనేన చక్షుషా సర్వే
    భగవాననయా దృష్ట్యా న లక్ష్యతే జ్ఞానదృగ్గమ్యః

**అన్ని పదార్థములు భువి కన్నుల కగపడుచునుందు కానీ కృష్ణుం**
**డెన్నడు కన్నుల కగపడ దన్నింటన్ జ్ఞానగమ్యుడై వసియించున్**

వివరణ:

**దృశ్యమగు పదార్థములను తెలియజేయు చర్మచక్షువు లజ్ఞాన జన్య జగతి**
**ఈశుడీ త్రిపుటికి సాక్షి ఈతడెట్లు కంటికగుపడు విజ్ఞానగమ్యుడతడు**

సృష్టిలో అన్ని పదార్థములు ద్రష్ట, దృష్టి, దృశ్యము అనే త్రిపుటిచేతనే తెలియబడు తున్నాయి. ఈ త్రిపుటికి సాక్షియే పరమాత్మ. ఆయన అన్నింటిని తెలుసుకోగలడు కాని, ఆయనను ఎవరూ చూడలేరు. పంచేంద్రియములకు విషయము కాడు గనుక ద్వైతదృష్టిమయమైన మనస్సుకు అందడు.

198. యద్విశ్వరూపసమయే పార్థాయ హి దత్తవాన్ భగవాన్
    దివ్యం చక్షుస్తస్మాత్ అదృశ్యతా యుజ్యతే నృహరౌ

మును విశ్వరూప సందర్శన సమయంబునందు దివ్యచక్షు వొసంగెన్
మన హరి నరునకు నరహరి కనరాదీ కంటికనుట కదుయుక్తమగున్

వివరణ:

తన నిజరూపము కనులకు, గనరాదనియే యెఱింగి కదనస్థలి న
ర్జునుకై యిచ్చెను శ్రీహరి, కనులన్ దివ్యాత్మకముల గనుటకు తననే.

అటుల హరియందే నిఖిల విశ్వమ్ము జూచి యతని కాలాత్మకతను తానరయలేక
భయమునన్ వేడ కరుణించి పలికె జ్ఞానగమ్యుడగు హరి తన గూర్చి కాలుడనని

199. సాక్షాత్ యద్వైకదేశేవర్తులముపలభ్యతే రవేర్బిమ్బమ్
విశ్వం ప్రకాశయతి తత్ సర్వైః సర్వత్ర దృశ్యతే యుగపత్

ఇంచుక తావున గుండ్రని దెంచగ రవిబింబ మెదుటనే యున్నను వె
ల్గించును జగమెల్లను గన్పించున యెల్లరకు నెల్లయెడ నొక్కతరిన్

వివరణ:

సూర్యబింబమొక్కచోట తూర్పున దోచి వెలుగు లోకమెల్ల యలమినట్లు
కృష్ణమూర్తి యొక్క కెలన కన్పట్టె విశ్వమ్ము నిండియుండు సర్వమయత

200. యద్యపి సాకారోఽయం తథైకదేశీ విభాతి యదునాథః
సర్వగతః సర్వాత్మా తథా స్వయం సచ్చిదానన్దః

ఆ విధమున యదునాథుం డే పలనను నెట్టి రూప మెనసినదైనన్
కేవల సచ్చిత్సుఖమై యీవల నావలను వెల్గు నెల్లందానై

వివరణ:

సాకారుడయ్యు లోకపు టాకారంబులకు తానె యాత్మండై చి
త్తాకాశంబున విజ్ఞానాకృతినిన్ విమలసౌఖ్యమై విలసిల్లున్

శాకలవముదిని కృష్ణుడు లోకస్థుల బొజ్జ నింపి ద్రుపదుని సుతకున్,
వ్యాకులము డించి మునులకు నాకలి బోకార్చి తీర్చెనాతిథ్యంబున్.

201. ఏకోఽపి భగవాన్ రేమే యుగపత్ గోపీష్వనేకాసు
అథవా విదేహజనకశ్రుతదేవయోర్ద్వరిర్యుగపత్

**ఒక్కపుడే హరితనిపెను పెక్కురు గోపికల సురత విస్ఫురణమునన్**
**నిక్కడ జనకుని యింటను, నక్కడ శ్రుతదేవునింట నతిథిగ దోచెన్**

ఒకే సమయములో కృష్ణమూర్తి పెక్కురు గోపికలతో శృంగారము నిర్వహించినాడు. అట్లాగే విదేహాధిపతి జనకుని ఇంట్లో, శ్రుతదేవుడను విప్రుని ఇంట్లో ఒకే సమయంలో సప్తర్షులతో సహా అతిధ్యము స్వీకరించినాడు. పదునారువేలమంది రాజపుత్రికలను పదునారువేల వివాహమండపములలో ఒకేసారి వివాహమాడినాడు.

202. అథవా కృష్ణాకారాం స్వచమూం దుర్యోధనోஉ పశ్యత్
తస్మాత్ వ్యాపక ఆత్మా భగవాన్ హరిరీశ్వరః కృష్ణః

**అదె తీరున దుర్యోధను డెదుటన్ దన సేన జూచె కృష్ణాకృతిగా**
**నదె యాత్మని వ్యాప్యత్వం మ్మదిరా పరమాత్ముడీశుడగు కృష్ణుండే**

తాత్పర్యము స్పష్టము

203. వక్షసి యదా జఘాన ఋషిర్భృగుః శ్రీపతేః స కిం ద్వేష్యః
భక్తానామసురాణామ్ అన్యేషాం వా ఫలం సదృశమ్

**ఉరమునను దన్నె శ్రీవత్సముని యటన్న శ్రీనివాసుడు ద్వేషింపలేదు మునిని**
**హరిని జెందిన భక్తులు నసురులైన నితరులైనను ఫలమొక్కటే వరించు**

శ్రీవత్సముని అనగా భృగుమహర్షి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల తారతమ్యమును పరీక్షింపగోరి (మునుల కోరికపై) బ్రహ్మను, శివుని సమీపించి విఫలుడై; అంటే సామాన్యమైన అవినయము ప్రదర్శించి కోపమునకు ఆస్పదుడై విష్ణుని వద్దకు వచ్చి ఆదిశేషునిపై పవళించి లక్ష్మీదేవి పాదసంవాహనమునొనర్చు సమయములో, ఆతని గుండెలలో తన్నినాడు. తన స్థానములో తన్నినందుకు మహాలక్ష్మి ఆగ్రహించి, ముని యొక్క దుర్నయమునకు శిక్షవేయని విష్ణునిపై కోపించి ఆయనను వీడిపోయినది. అయినను విష్ణుదేవుడు ఆయనపై కోపించలేదు. పైగా ఎదురేగి గౌరవించనందుకు క్షమాపణ కోరినాడు. అందుచేత బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో విష్ణుడే కోపమును జయించినందున విశిష్టుడని మునులందరికి ఋజువు అయినది.

204. తస్మాన్న కోఽపి శత్రుర్నో మిత్రః నాప్యుదాసీనః
స హరిః సన్మార్గస్థః సఫలః శాఖీవ యదునాథః

అందుచేత హరికి నరిలే దుదాసీనుడైనలేదు మిత్రుడైన లేడు
సత్యమార్గమందు సఫల వృక్షము బోలు అందుకొన్న నిచ్చు నపుడె ఫలము

వివరణ:

కదిసి శుద్ధ సత్త్వఘనుని శ్రీకృష్ణునిన్ క్షయమొనర్చుకొని రజస్తమములు
పూతనయును గోపికా తనూజాతలున్ ముక్తిగనిరి బహు తపోధనులటు

205. లోకశలాకానివహైః స్పర్శాత్మని భిద్యమానేఽపి
స్వర్ణత్వమేతి లోహః ద్వేషాదపి విద్విషాం తథా ప్రాప్తిః

పరుసవేది రాతబడిన సమ్మెట దెబ్బ కినుము హేమమగుట వినమె రిపులు
వైరభావముననే పరవశత్వమునొంది హరిని దొరరి ముక్తినందుకొనిరి

హరిని ఏ భావముతో సమీపించినా "సద్యామధ్యానగరిష్ఠ"డైననో (నారద ధర్మరాజ సంవాదము, శిశుపాల వధానంతరము) హరినే చెందుతాడు. ఇది ఎట్లాగంటే, పరుసవేదియైన రాతిని ఇనుపసమ్మెటతో పగులగొట్టినా ఇనుము బంగారమే అవుతుంది. అట్లాగే కంస, శిశుపాలాదులు హరిని వైరభావముతో ఆరాధించి ముక్తిని పొందినారు (ఆరాధన అంటే ఎడతెగని ధ్యానమే). "యథా కథంచిత్ తదాసక్తిః ముక్తి కారణముచ్యతే" ... అనగా ఏదో విధంగా హరియందలి ఆసక్తి ముక్తికి కారణమవుతుంది అని శ్రీశుకులు పరీక్షిత్తుకు సంశయము నివారించారు. "కామం, క్రోధం, భయం, స్నేహమైక్యం సౌహృదమేవ నవా నిత్యం హరౌ విదధతో యాన్తి తన్మయతాం హి తే" కామమును కాని, క్రోధమును కాని, భయమును కాని, స్నేహమును కాని, ఐక్య మనగా సంబంధమును కాని నిత్యము హరియందు నిలుపుకొనువారు హరిమయులే అవుతారు.

206. సర్వాత్మనః సకాశాత్ ఉత్పన్నా జీవసన్తతిశ్శ్రేయమ్
జగతః ప్రియతర ఆత్మా తత్ప్రకృతేనైవ సంభవతి

ఆత్మయందుండి కలిగిన దఖిల జీవ సంతతి యదౌట నాత్మయే జంతుతతికి
మిగుల ప్రియమగు నిది సృష్టికగును రీతి ఉపనిషత్తులు దీనినే చెపును గాదె

జీవులందరునూ పరమాత్మ ప్రతిబింబరూపములే. అందుచేత నాత్మనుండియే సంభవించినారు. ప్రతి శరీరధారికినీ ఆత్మయే మిక్కిలి ప్రియము. ఎందుకంటే శరీరధారి ఒక శరీరమును విడిచి మరొక శరీరమును ధరించినా, ఆత్మను విడిచి ఏ సమయములోనూ లేడు. తనను తానే ఇతరునిగా భ్రమచేత భావించుకున్నా తన నిజస్వరూపము ఆత్మయే. అందుచేత సృష్టి మొత్తముమీద ఏ శరీరధారియైనా, అపత్సమయంలో తానే అనుకున్న శరీరం కోసం అన్ని సంబంధములను త్యాగం చేస్తాడు. శ్రీకృష్ణుడు ఆత్మయే కనుక సర్వజీవులకు ఆయనయే ప్రియతముడు. బ్రహ్మానందస్వరూపుడు కనుక లౌకికానందముల కంటే ఉత్కృష్టుడు.

207\. వత్సాపహరణావసరే పృథగ్వయోరూపవాసనాభూషాన్
హరిరజమోహం కర్తుం సవత్సగోపాన్ వినిర్మమే స్వస్మాత్

అజుని వంచింప వత్సాపహార సమయ మందు హరి తననుండియే యఖిల గోప
వత్సములనెల్ల కలిగించె వయసు, రూప, వాసనాభూషణములు వేర్పడిన రీతి

వత్సాపహరణఘట్టమునందు, బ్రహ్మ చేసిన మాయను మాయం చేసేందుకు తననుండియే, అంటే తానే అందరికీ ఆత్మభావము వహిస్తూ, సరిగా అట్టి గోపవత్సములనే – వయసూ, రూపమూ, మనఃప్రవృత్తిరూపమైన వాసనలు భూషణములలో ఏవిధమైన మార్పు లేకుండా సృష్టించినాడు.

208\. అగ్నేర్యథా స్ఫులింగాః క్షుద్రాస్తు వ్యుచ్చరంతీతి
శ్రుత్యర్థం దర్శయితుం స్వతనోరతనోత్స జీవసందోహమ్

నిప్పున మిణుగురు లెగిరిన చొప్పున శ్రుతియర్థ మెదుట జూపగ హరితా
నప్పగిదిన్ తననుండియె రప్పించెను బహుళజీవులను తన మహిమన్

మహాగ్నినుండి నిప్పుకణములు ప్రవాహముగా ఎగిరినట్లు శ్రీకృష్ణుడు తన పరమాత్మ భావమునుండియే అనేక గోపవత్సములుగా కనుపించే జీవులను సృష్టించినాడు. వీరందరూ అప్పటి బ్రహ్మ సృష్టిలోనివారు కాదు. కనుకనే బ్రహ్మ ద్వైతభ్రాన్తిలో ఉన్నవాడు విమూఢుడైపోయినాడు కనుక; తానూ, తన సృష్టిలోని జీవులు కూడా పరమాత్మ ప్రతిబింబాలనీ, పరమాత్మకంటే వేరుకామనీ మరచిపోయినాడు.

209. యమునాతీరనికుఞ్జే కదాచిదపి వత్సకాంశ్చ చారయతి
కృష్ణే తథాఽన్యగోపేషు చ వరగోష్ఠేషు చారయత్స్వారాత్
210. వత్సం నిరీక్ష్య దూరాద్గావః స్నేహేన సంభ్రాన్తాః
తదభిముఖం ధావన్త్యః ప్రయయుర్గోపైశ్చ దుర్వారాః

**లేగలగని దూరమునన్ దా గోవులు తూగి ప్రేమనభిముఖములునై**
**మూగెను పర్విడి పట్టున నాగక గోపకులవర్గ మట్టిటుకాగన్**
**లేగలును బాలురును నగు రీతి నెరపి యమున యొద్దున నున్నపై హరిచరించె**
**గొల్లతల్లుల వద్దను గోష్ఠమందు గోకులము నిండి తన బహుళాకృతులను**

లేగలు, బాలురూ కూడా తాను అయి వుండి ఎప్పుడైనా సరే శ్రీకృష్ణుడు యమున ఒడ్డున లేగలను మేపుతూ ఉండేవాడు. అదే సమయములో గోపబాలుర రూపంలో వారి తల్లులవద్దనూ, గోష్ఠములో దూడల రూపంలో గోవులవద్దనూ తానే ప్రవర్తించేవాడు.

పెద్దవారైన గోపకులు ఆవులను దూరముగా నుండి మేపుచుండగా గోపబాలురు దూడలను నడిపించుట దూరమునుండియే చూచి తమ సంతానమందలి ఆపేక్ష పొంగి పొరలగా, గోపాలురు ఆపినను ఆగక పరువెత్తికొనివచ్చి తమ దూడలకు తల్లిగోవులు పాలు గుడిపినవి. శ్రీకృష్ణుడు లేగరూపముల ధరించినందున ఈ ప్రేమ పూర్వము కంటె ఇనుమడించినది. సంతానమందలి ప్రేమకంటే పరమాత్మయందలి ప్రేమ అతిశయించినది. ఇది ఆత్మయే అన్నిటికంటె ప్రియతరమన్న ఉపనిషదుక్తికి ప్రత్యక్ష తార్కాణము.

211. ప్రసవభరేణ భూయః స్రుతస్తనాః ప్రాప్య పూర్వవత్ వత్సాన్
పృథురసనయా లిహన్త్యః తర్ణకవత్సస్పపాయయన్ ప్రముదా

**మునుపువోలె లేగలను జేర పర్విడున్, పాలుగారు పొదుగు బరువుగొలుప**
**గోవులట్టి ప్రీతిగొని నాకు లేగలన్ పాలు గుడుపునపుడు పరవశతను**

ఇంతకుమునుపే ఈనిన ఆవులు కూడా పొదుగు విడిచి మేతకు వెళ్లే దూడలను జూచి పరమ ప్రేమతో పరువెత్తినవి. అట్లు ఆ దూడలను జేరుకొని ప్రేమతో నాకుతూ పాలు గుడిపించినవి. ఈ ఆవులయందలి ప్రేమలోని ఉత్సాహము బలరాముని కూడా ఆశ్చర్యపరచినది. గోపబాలురు, వత్సములు కూడా ఆయనకు కృష్ణునివలెనే తోచినందున బ్రహ్మ చేసిన మాయ గురించి, శ్రీకృష్ణుడు చేసిన స్వాత్మప్రాచుర్యము గురించి శ్రీకృష్ణుని

అడిగి తెలుసుకున్నాడు. (అంటే తనను తనే పెక్కువిధములుగా కల్పించుకొనుట.)

212. గోపా అపి నిజబాలాన్ జగృహుర్మూర్ధానమాఘ్రాయ
ఇత్థమలౌకికలాభస్తేషాం తత్ర క్షణం వవృధే

**గోపాలురు తమ పిల్లల మూపున కెక్కించుకొనిరి. మూర్కొని మూర్ధ**
**మ్మా పల్లెన్ విలసిల్లె నిలా పరమ మలౌకికమ్ము లాభమ్మేదో**

ఆవులు తమ మాట విననందుకు కోపించిన గోపకులు ఆ ఆవుల వెనుకగా పరువెత్తి చేరుకుని కృష్ణస్వరూపులైన తమ పిల్లలను చూచి కోపమును మరచి పుత్రప్రేమ పొంగిపోగా వారిని మూర్ధాఘ్రాణము చేసి, మూపునకెక్కించుకొని పరమానందం పొందినారు. ఆ గోకులములో ఇలా పరమాత్మానుభావం వల్ల అలౌకికానందము లభించింది.

213. గోపా వత్సాశ్చాన్యే పూర్వం కృష్ణాత్మకా.వ్యభవన్
తేనాత్మనః ప్రియత్వం దర్శితమేతేన కృష్ణేన

**తే.గీ॥ లేగలున్ బాలురు, నితరు లేను పూర్వ మిపుడు కృష్ణాత్మకత్వంబు నెనసినారు**
**దీన ప్రియతరమాత్మ జగానవెల్ల జీవులకటంచు శౌరి సూచించెనిట్లు**

పూర్వము లేగలును, బాలురును కృష్ణునికంటె వేరైయుండిరి. ఇప్పుడు వారందరూ కృష్ణాత్మకులే అయినారు. గోవులకు, గోపాలురకు తమ సంతానముపై పూర్వము కంటె ఎక్కువ ప్రేమభావము కలుగుటకు అదియే కారణము. దీనివల్ల శ్రీకృష్ణుడు ఉపనిషద్వాక్యమునకు ప్రత్యక్ష నిదర్శనము కల్పించినాడు. ఉపనిషద్వాక్యము ఇలా ఉంది: "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి". ఆత్మనే కోరుకొన్నవానికి తానే ఆత్మనని తెలిసినప్పుడు సర్వమూ ఆత్మస్వరూపమే కనుక సర్వమూ ప్రియమవు తుంది. ఆత్మ అంటే ఆనందస్వరూపమే. "ఆనందోబ్రహ్మ" అని శ్రుతి.

214. ప్రేయః పుత్రాద్విత్తాత్ప్రేయోఽన్యస్మాచ్చ సర్వస్మాత్
అన్తరతరం యదాత్మేత్యుపనిషదః సత్యతాభిహితా

**ఆత్మప్రియతరమ్ము అన్నిటికంటెను, పుత్రుమించి విత్తములకు మించి**
**అన్ని ప్రియములకును అంతర్యమానంద, మదె స్వరూపమాత్మ కనును శ్రుతులు**

తాత్పర్యము స్పష్టము

215. ననుచోచ్చావచభూతేష్వాత్మా సమ ఏవ వర్తతేఽథ హరిః
దుర్యోధనేఽర్జునే వా తరతమభావం కథం ను గతవాన్ సః

**క్రిందగు మీదగు భూతములందున్నది ఆత్మసమము నది హరియేయ**
**న్నం దుర్యోధన పార్థులయందున్ గను తరతమత్వమది ఎందులకో? .**

ఉత్తమాధమ శ్రేణికి చెందిన అందరు ప్రాణులయందునా ఆత్మ సమానంగానే నివసిస్తాడు. ఆ ఆత్మ శ్రీకృష్ణుడే అయినచో దుర్యోధనార్జునుల మధ్య తరతమభావము ఎందుకు చూపించినట్లు? తాను ఆత్మస్వరూపుడు గనుక వారి అంతర్యము నెరిగి ప్రవర్తించినాడే కాని, తానుగా వారియందు తరతమ భావము ప్రదర్శించలేదు. కృష్ణుడే తనకు ప్రాణాధికప్రియుడని అర్జునుడు భావిస్తే, కృష్ణుని వలన తను ఎట్టి లాభము పొందవచ్చునా అని దుర్యోధనుడు భావించినాడు. విశ్వరూపదర్శనము అర్జునునికీ అయినది, భీష్మద్రోణాదులతో సహా దుర్యోధనునికి కూడా అయినది. అయితే వారివారి అర్హతలకు అనుకూలముగా వారు ప్రయోజనము పొందినారు.

216. బధిరాన్ధపఙ్గుమూకా దీర్ఘా హ్రస్వాః సరూపాశ్చ
సర్వే విధినా దృష్టాః సవత్సగోపాశ్చతుర్భుజాస్తత్ర

**విధి చతుర్భుజులుగ వీక్షించె నందరిన్, చెవిటి గుడ్డి మూగ నవిటివారి**
**గోపవత్సములను రూపించినప్పుడు హరి శరీరభేదమరయకుండ**

వత్సాపహార ఘట్టములో శ్రీకృష్ణుడు మొదట తాను అనేక వత్సములుగానూ, అనేక గోపబాలురుగానూ కనుపించి తరువాత అందరినీ చతుర్భుజులుగా విష్ణుస్వరూపులుగా, దుర్నిరీక్ష్య తేజులుగా చూపించినాడు. ఎన్ని శరీరభేదములున్నా ఆత్మవ్యాప్తి సమానముగానే ఉంటుందని చూపించినాడు.

217. భూతసమత్వం నృహరేః సమో హి మశకేన నాగేన
లోకైః సమః త్రిభిర్వేత్యుపనిషదా భాషితః సాక్షాత్

**నిఖిల భూతసమత్వంబు నృహరినైజ మిది తెలంగుము దోమకు నేన్గుకైన**
**ముజ్జగంబుల నృహరి సముడనుమాట పలికె నుపనిషత్తులును విస్పష్టముగను**

మశకములోనూ, మాతంగములోనూ అంతర్యామిగా శ్రీకృష్ణుడు తెలియబడుతాడు. మూడు లోకాలలోనూ హరికి సమానభావమే వున్నదని ఉపనిషత్తులు నిర్వచించినవి.

218. ఆత్మా తావదభోక్తా తత్రైవ నను వాసుదేవశ్చేత్
నానాకైతవయత్నైః పరరమణీభిః కథం రమతే

ఆత్మ విషయభోగ మందుకోనట్టులే, వాసుదేవు డనుభవముల గొనడు
అనుట నిక్కమైన నా దొంగతెరవుల వేల పరసతుల రమించుకొరకు

శ్రీకృష్ణుడు శరీరము స్వీకరించి ఈ లోకములో అవతరించుట మానవులకు మోక్షము కల్పించుటకే. లేకపోతే నిర్గుణుడై, గుణమయమైన ప్రకృతిని నియమించేవానికి సామాన్యముగా కర్మానుగుణమైన దేహము ధరించేవారితో ఏవిధమైన సాదృశ్యమూ లేదు. సర్వాంతర్యామియై గోపికలకు, వారి పతులకు అంతర్వర్తియై యున్నవానికి పరసతులు అంటూ ఉండరు. ప్రాణులనందరినీ అనుగ్రహించడానికి దేహాన్ని స్వీకరించిన శ్రీహరి శృంగారరసంవల్ల ఆకర్షితులైనవారి మనస్సులను తనయందు లగ్నము చేయించి, బహిర్ముఖత్వము తొలగించడానికి ఆయా లీలలు చేసినాడు. ఆయన ఆత్మారాముడనీ, ఊర్ధ్వరేతస్కుడనీ, బ్రహ్మాదులను జయించిన మన్మథుని గర్వభంగము చేసినాడనీ భాగవతం చెప్తోంది.

219. సున్దరమభినవరూపం కృష్ణం దృష్ట్వా విమోహితా గోప్యః
తమభిలషన్త్యో మనసా కామాత్ విరహవ్యథాం ప్రాపుః

అందమె రూపముగొన నతిసుందరునిన్ నందతనయు జూచి వలపునన్
అందరు వ్రజసుందరులటు పొందిరి కన్దర్ప తాపమును విరహమునన్

శుకమహర్షి శ్రీకృష్ణుని సాక్షాన్మన్మథ మన్మథుడన్నారు. అంటే మన్మథుని కూడా మోహింపజేసే రూపము ధరించిన శ్రీకృష్ణమూర్తిని నందవ్రజమునందలి గోపికలు మోహించి ఆయనను పొందగోరి విరహతాపమును అనుభవించినారు.

220. గచ్ఛన్త్యః తిష్ఠన్త్యో గృహకృత్య పరాశ్చ భుంజానాః
కృష్ణం వినాఽన్యవిషయం సమక్షమపి జాతు నావిన్దన్

**నడచుచు మరి నిలబడుచున్ గుడుచుచు నిలుదీర్చికొనుచు గొల్లపడుచు లె**
**న్నడు కృష్ణుం గా కెదుటం బడిన మరే విషయమేని పరికింపరటన్**

శ్రీకృష్ణునియందలి మోహముచేత పరవశత్వము నొందిన గోపికలు ఆయన యందే ఆసక్తితో ధ్యానిస్తూ ఆయన తప్ప మరే వస్తువునైనా గుర్తింపలేకపోయినారు. నడుస్తూ, నిలబడుతూ, ఇంటిపనులు చేసుకుంటూ, భోజనము చేస్తూ కూడా వారి మనస్సులు ఆయనయందే లీనమైయుండినవి. ఇట్టి ఏకాగ్రత మునులయందు, మహాభక్తులయందే కనుపిస్తుంది. అంటే శ్రీకృష్ణుని ఆకర్షణ, సామాన్యులై, విద్యాగంధములేని గోపికలకు అట్టి సర్వోన్నతస్థితి కల్పించినది. కంసుడు ఇట్లాగే భయంతో ఆయనను తల్చుకొంటూ చివరకు ఆయనలోనే లీనమయినాడు.

221. ముఃసహ విరహత్రాన్యా స్వపతీన్ దదృశుస్తరూన్నరాంశ్చ పశూన్
హరిరయమితి సుప్రీతాః సరభసమాలిఙ్గయాం చక్రుః

**కాళంజాలక విరహవ్యాలోలత నరుల తరుల నాత్మపతులనున్**
**ఆలంగని హరియితడని యాలింగనముల నొనర్చి రతివలు ప్రీతిన్**

భక్తియొక్క పరిపక్వదశలో సకల జంతుజాలములో శ్రీకృష్ణ దర్శనమవుతుంది. అట్టి పరిస్థితి అమాయికలైన గోపికలకు కలిగింది. వారు కృష్ణ విరహమున మనస్సు కొందలపాటు చెందగా, ఏది కనుపించినా శ్రీకృష్ణుడని ఆలింగనము చేసుకున్నారు. ఆ కనుపించినది ఎదురుగా నరులైనా, తరులైనా, ఆవులైనా, ఆత్మపతులైనా వారికి శ్రీకృష్ణుడే కనుపించినాడు. వారిని ఉద్ధవుడు, తానే పరమభాగవతుడై ఉండీ, కీర్తించినాడు, వారి పాదరేణువులకు నమస్కారమన్నాడు.

222. కా పి చ కృష్ణాయన్తీ కస్యాశ్చిత్ పూతనాయన్త్యాః
అపిబత్ స్తనమితి సాక్షాద్ వ్యాసో నారాయణః ప్రాహ

**అభినయించెనొకతె హరి నేనె యనుచును ఒకతె పూతనగను ప్రకటమంది**
**హరికి చన్ను గుడిపెనని వ్యాసుడే పల్కె ఆత్మ యందరికిని హరియనంగ**

ఉన్నట్లే ఉండి అంతర్ధానమైన శ్రీకృష్ణుని వెతకులాడుతూ గోపికలు అందరూ కృష్ణావేశముతో ప్రవర్తించినారు. ఒకతె నేనే కృష్ణుడనన్నది. ఇంకొకతె నేనే పూతనను

అని ఆ కృష్ణుడనని యన్న గోపికకు చన్ను గుడిపినది. ఈ మాట భాగవతము రచించిన వేదవ్యాస భగవానుడే యన్నాడు. దీనివలన గోపికలందరి మనస్సులు శ్రీకృష్ణుని చేతనే వ్యాపింపబడినవని తెలుస్తోంది. ఈ కృష్ణావేశము భక్తికి పరమావధి గదా!

223. తస్మాన్నిజనిజదయితాన్ కృష్ణాకారాన్ వ్రజస్త్రియో వీక్ష్య
స్వపరనృపతిపత్నీనాం అన్తర్యామీ హరిస్సాక్షాత్

**అందున తమ తమ పతులన్ అందరు సుందరులు కృష్ణు నాకారమ్మునన్**
**సందర్శించిరి హరియ య్యందరు దంపతులు తానయై విహరించెన్**

శ్రీకృష్ణుడంతర్యామియైనందున తన పర భేదము లేక పతులలోనూ, పత్నులలోనూ తానే యుండి వారికి ఆత్మానందానుభవము కల్పించెను.

224. పరమార్థతో విచారే గుడతన్మధురత్వదృష్టాన్తాత్
నశ్వరమపి నరదేహం పరమాత్మాకారతాం యాతి

**ఈ పగిది తత్త్వమరసిన, దీపియు బెల్లంబు వలెను దేహము**
**నష్టం బైపోయిడిదేయైనను, నా పరమాత్మ స్వరూపమై విలసిల్లున్**

వివరణ:

బెల్లపు గడ్డన్ మధురిమ, యెల్లెడల నణు ప్రమాణమే యగు నంశన్
దెల్లమగు, నాగుడత్వమ దెల్లన్ మధురిమయె భేదమింతయు లేకన్
ఈ పగిది నాత్మ సర్వము వ్యాపించుట చేత నింద్రియమ్ముల వెంటన్
రూపింతురున్న దిదియని యే పట్టున నున్నదనుటయే సారమ్మౌ.
ఈ సారమె సర్వాత్మక మీ సూక్ష్మ స్థూలజగతి నిదెయున్నదనున్
దా సాక్షియు తెల్వియునై భాసించెడి నున్నదన్న పలుతత్త్వములన్
బెల్లమున తీపియున్ బలె యెల్ల జగంబునకు నాత్మయే సారమగున్
దెల్లమిది స్వప్నజగతిని యుల్లం బమనస్కమగుచునున్నన్ దెలినై

"అయమాత్మా బ్రహ్మ" అన్నదే మహావాక్యము. అహంకారమునుండి దేహము వరకు అన్నిటిని వర్జించి నేను అని తెలియబడే ఆత్మయే బ్రహ్మ. బ్రహ్మమనగా కనుపించే దేహాది బాహ్య ప్రపంచము యొక్క అసలు తత్త్వము. అంటే దృశ్యజగత్తులో ఉన్నదంతా బ్రహ్మమే.

225. కిం పునరనన్తశక్తేః లీలావపురీశ్వర స్యేహ
కర్మా ణ్యలౌకికాని స్వమాయయా విదధతో నృహరేః

ఇక చెప్పెడిదేమి నరహరి సకలేశ్వరుం డనంతశక్తియుతుండున్
ప్రకటించును తన మాయన్ ఒకతన దేహమ్మునందె నూర్జితలీలన్

మర్త్య దేహమే అసలు తత్త్వములో ఆత్మాకారతను చెందినపుడు అనంత శక్తియుతుడు, అఘటఘటనాసమర్థమైన మాయను స్వాధీనము చేసికొనియున్నవాడు తన దేహమునందే ఎన్నో లీలలు చూపించగలడు. భాగవతములో ఈ లీలలు విరివిగా వర్ణింపబడినవి.

226. మృద్భక్షణేన కుపితాం వికసితవదనాం స్వమాతరం వక్త్రే
విశ్వమదర్శయదఖిలం కిం పునరథ విశ్వరూపో౽ సౌ

మన్నుం దినెనని కినుకను గన్నమ్మకు నోరు తెరచి కలవిశ్వమ్మున్
గ్రన్నన జూపెను బుడుతడు విన్నాణియు విశ్వమయుడు విష్ణుం డతడే

# 19

# అనుగ్రహ ప్రకరణము

227. విషవిషమస్తనయుగలం పాయయితుం పూతనా గృహం ప్రాప్తా
తస్యాః పృథుభాగ్యాయాః ఆసీత్ కృష్ణార్పణం దేహః

చనుల విషము బూసికొని వచ్చె పూతన చంటిబిడ్డ కృష్ణు జంపు కొరకు
ఇట్టి క్రౌర్యమున లభించె మహద్భాగ్య మాహుతిగొనె దేహ మచ్యుతాగ్ని

శ్రీకృష్ణుడు తనకు విరోధులై వచ్చినవారిని కూడా కరుణించి ముక్తి ఇచ్చాడు. ఆయనకు వారి పూర్వజన్మ సంస్కారములన్నీ తెలుసును. వామనావతారములో బలిచక్రవర్తికి సోదరియై ఉండి, చిన్న వటువు వేషములో ఉన్న వామనుడ్ని చూసి ఇట్లాంటి కొడుకు నాకు ఉంటే బాగుండునని పూతన అనుకున్నది. మళ్లీ బలిని పదభ్రష్టుడ్ని చేసిన వామనుడ్ని చూచి, వీడు నా కొడుకైతే, పుట్టినప్పుడే చన్నులకు విషము పూసికొని చంపివేయాలని అనుకున్నది. ఆమె కోరిక ఈ జన్మలో తీర్చి తన తల్లికి ఇచ్చిన పరమగతియే ఆమెకూ ఇచ్చినాడు.

228. అనయత్ పృథుతరశకటం నిజనికటం వాక్కృతాపరాధమపి
కంఠాశ్లేషవిశేషాదవధీద్బాల్యేఽసురం కృష్ణః

శకటాసురు నపరాధిని నికటస్థితి ఇచ్చి పుణ్యునిం జేసెను; కు
త్సుక బిగికౌగిలిలో హరి యొక్క యసురుని ద్రుంచి ముక్తినొసగెన్ ప్రీతిన్

శ్రీకృష్ణుడు చంటివాడై తల్లిపాలకోసము ఏడుస్తూ తామరతూడు వలె మృదువులైన

పాదములను విదిల్చాడు. ఆ కాలు శకటరూపంలో కృష్ణుని ఉయ్యాలను ఆవరించిన రాక్షసునికి వజ్రాహతి వలె తగిలింది. ఆ దెబ్బకు చూచేవారంతా ఆశ్చర్యనిమగ్నులు కాగా, ఆ శకటము ఎన్నో ముక్కలుగా విరిగిపోయినది. ఆ అసురునికి కృష్ణ పాదాహతి వలన పాపసంక్షయమై ముక్తి లభించినది. ఇంకొకసారి తృణావర్తుడనే రాక్షసుడు సుడిగాలి రూపములో వచ్చి, ఉన్నట్టుండి బరువనిపించి తల్లి నేలమీదకు దించిన బాలుణ్ణి ఎత్తుకుపోయినాడు. కృష్ణుడు వాని మెడ పట్టుకొని కౌగలించుకున్నట్లు వ్రేల్లాడినాడు. జగత్తు అంతా బొజ్జలో ఉన్న కృష్ణుని బరువు వాడు మోయనూ లేక, కంఠానికి తగులుకున్న కౌగిలిబంధము వదిలించుకోనూ లేక నేలపైబడి ప్రాణాలు వదిలినాడు. అయినా శ్రీకృష్ణుని కౌగిలి అనుభవించినందుకు వాని పాపములు నశించి ముక్తిని పొందినాడు.

229. యమలార్జునౌ తరూ ఉమ్మూల్యోలూఖలగతశ్చిరం భిన్నౌ
రిజ్జన్నుల్లణభూమౌ స్వమూలయం ప్రాపయన్నృహరిః

**కట్టువడి రోట వాకిట, నిట్టటులన్ ప్రాకుమంది యిరు మద్దియలన్**
**విట్టు గుములు చెట్లం దన పట్టునకుం జేర్చె శౌరి పసివాడయ్యున్**

రెండు మద్దిచెట్లు మిక్కిలి దగ్గరగా పెరిగినవి. అవి కుబేరుని పుత్రులైన నలకూబరమణిగ్రీవులు. తన శాపము అనే అనుగ్రహము వలన వారి మదాంధతను పోగొట్టే ఉద్దేశముతో నారదుడే వారికీ స్థితి కల్పించి, పరమాత్ముడైన శ్రీకృష్ణుని వలననే శాపవిముక్తిని నిర్దేశించినాడు. తన భక్తుడైన నారదుని మాట నిజము చేయడానికి శ్రీకృష్ణుడు రోటిని ఈడ్చుకుంటూ పాకుతూ వెళ్ళి ఆ చెట్లకు తగిలించినాడు. యశోదయే ఆయన అల్లరి చేష్టలకు శిక్షగా శ్రీకృష్ణుని ఆ రోటికి కట్టినది. వెంటనే ఆ కుబేరుని కుమారులు స్వస్వరూపమును ధరించి శ్రీకృష్ణుని స్తోత్రము చేసి తమ స్థానములకు వెళ్ళిపోయినారు. చంటిబిడ్డ చేష్టలతో కూడా భగవానుడు ఎవరో ఒకరిమీద అనుగ్రహము చూపిస్తూనే ఉన్నాడు.

230. నిత్యం త్రిదశద్వేషీ యేన చ మృత్యోర్వశం నీతః
కాకః కోఽపి వరాకో బకోఽపృశోకం గతో లోకం

**దేవతలను సతము ద్వేషించువారైన యసురులందు కాకమతి దురాత్మ**
**బకము భీకరమ్ము వధియించి వీరిని హరియశోకలోకమందు జేర్చె**

231. గోగోపీగోపానాం నికరమహిం పీడయన్తమతివేగాత్
అనఘమఘాసురమకరోత్ పృథుతరమురగేశ్వరం భగవాన్

**గోగోపీ గోపులనతి వేగమ్మున పీడజేయు పెనుబాము నఘున్**
**ఆ గాలియు నురగేశ్వరు, బాగుగ పుణ్యుల నొనర్చె భగవంతు డహో**

అఘాసురుడు ఒక మహాసర్పము. వాని నోరు కొండగుహ వలె నుండినది. కృష్ణుడు ఉండగా మనకేమి భయమని తనతోటి గోపాలురు ఆ గుహవంటి నోటిలో ప్రవేశించినారు. వారిని కాపాడుటకై కృష్ణుడు తాను గూడా ఆ పాము నోటిలో ప్రవేశించి శరీరమును పెంచి ఆ పాముకు శ్వాసను బంధించి వధించినాడు. ఆ పాము నుండి ఒక తేజస్సు వచ్చి శ్రీకృష్ణునిలో ప్రవేశించినది. మరణించిన గోపాలబాలురను తన అమృతదృష్టిని సారించి బ్రతికించినాడు. అదేవిధముగా కాళీయుడు అనే సర్పము, గరుడునికి భయపడి యమున మడుగులో నివసించి తన విషముతో నదీజలమును విషమయము చేసి గోవులకు, గోపాలురకు హాని చేసినాడు. వానిని ఎదుర్కొని నదిలోనే వాని పడగలపై తాండవమాడి రక్షింపుమని వేడుకొనగా తన పాదముద్రలను పడగపై వేసి నీకు గరుడుని భయము లేదని వెడలగొట్టినాడు.

232. పీత్వా రణ్యహుతాశనమసహ్యతత్తేజసో హేతోః
దగ్ధాన్ ముగ్ధాన్ అఖిలాన్ జుగోప గోపాన్ కృపాసిన్ధుః

**త్రావెను దావానలమును నా వేడికి మాడిపోవు నతి ముగ్ధులనా**
**గోవుల గోపుల నందరి జీవింపగజేసె తాను శ్రీకృష్ణుండే**

కాళీయుని అనుగ్రహించిన రోజున శ్రీకృష్ణునికి ప్రమాదము వచ్చినదని భయపడి గోకులము వారందరూ యమున వద్దకు పరుగెత్తి, కాళీయ నిగ్రహము తరువాత అక్కడనే గోవులతో పాటు రాత్రి నివసించినారు. ఆ సమయములో దావాగ్ని వ్యాపించి అందరినీ మృత్యుభీతితో భ్రాన్తులను చేయగా, శ్రీకృష్ణుని రక్షింపుమని వేడుకున్నారు. కృష్ణుడు వారందరినీ కండ్లు మూసుకొనుమని చెప్పి ఆ దావాగ్నిని తన లోపలికి ఆకర్షించుకున్నాడు.

233. పాతుం గోకులమాకులమశనితటిద్వర్షబైః కృష్ణః
అసహాయ ఏకహస్తే గోవర్ధనముద్దధారోచ్చైః

**పిడుగుల మెఱపుల వానల్ వడ వ్యాకులమైన గోకులమ్మును గావన్**
**వడినొక్క చేత నెత్తున గొడుగెత్తెన్ కృష్ణు డొకడె గోవర్ధనమున్**

ఇంద్రుని గర్వము పరిహరించుటకై కృష్ణుడు నందాదులు ఇంద్రునికై చేసే యాగమును మానిపించి, ఆ పూజను గోవర్ధన పర్వతమునకు చేయించి, వారు సమర్పించిన నైవేద్యమును తానే అదృశ్యరూపుడై ఆహరించినాడు. కోపోద్రిక్తుడైన దేవేన్ద్రుడు ఉరుములతో మెరుపులతో రాళ్లవాన కురుపిస్తే, గోకుల వాసులు కృష్ణుని శరణందితే, ఆయన ఒక చేతితో గోవర్ధన పర్వతమును పైకెత్తి పట్టుకొని గోకులము వారందరికీ ఇంద్రుని కోపాగ్నినుండి రక్షణ కల్పించినాడు. ఇంద్రునికి గర్వభంగమయి క్షమను వేడిన తరువాత బ్రహ్మాయానతిని కామధేనువు వచ్చి తన పాలతో శ్రీకృష్ణునికి అభిషేకము చేసి, ఇదే గోవిన్ద పట్టాభిషేకమనీ, ఇకముందు ఆయనకు గోవిందుడనీ, గోవులకు ఇన్ద్రుడనీ నిర్దేశించినది.

234. వాసో లోభాకులితం ధావద్రజకం శిలాతలైర్హత్వా
విస్మృత్య తదపరాధం వికుణ్ఠవాసోఽర్పితస్తస్మై

పలువలపై నాసం జాకలి రాలంగొట్టి పఱవగా నా దొసగున్
కలపక హరి యర్పించెను పలుతపముల మేటి పంట వైకుంఠమునున్

శ్రీకృష్ణ బలరాములు కంసుడు చేయబోయే ధనుర్యాగమును చూచుటకు వచ్చి, రాజవీధిలో నొక చాకలి రాజార్హమైన దుస్తులు తీసికొని పోతూ ఉండగా తమ కిమ్మని అడిగినారు. అతడు వారిని పరిహసించి రాళ్లతో కొట్టగా, శ్రీకృష్ణుడు అతనిని వధించి వైకుంఠమునకు పంపినాడు.

235. త్రేధావక్రశరీరామతిలంబోష్ఠీం స్ఖలద్వపు ర్వచనామ్
సక్చన్దనపరితోషాత్ కుబ్జామృజ్వానమాకరోత్

అదరు, ముప్వంక మేను వ్రేలాడు పెదవు లెలమి నిండిన మాటల కలరి కుబ్జ
పూలమాలల మంచి గంధాల తనిసి సముఖమిచ్చెను సొగసరి చానజేసి

మూడు వంకరల మేనితో వ్రేలాడు పెదవులతో గూనితో వికృతాకారమైన కుబ్జను కంసునికి గంధమాల్యములను కొనిపోవుచుండగా, సుందరీ అని పిలిచి తమకు ఆ గంధమాల్యములను ఇమ్మని అడిగినాడు కృష్ణుడు. ఆమె ఉబ్బిపోయి, వారిని ఆరాధించి అవి సమర్పించినది. అప్పుడు శ్రీకృష్ణుడు తన పాదముతో ఆమె పాదమును త్రొక్కిపెట్టి, చంకల క్రింద చేతులు వేసి, పైకెత్తి, ఆమెను సర్వాంగ సుందరినిగా చేసినాడు.

236. నిహతః పపాత హరిణా చరణాగ్రేణ కువలయాపీడః
పఞ్చాన్మత్తమతఙ్గః పతఙ్గవద్ దీపకస్యాగ్రే

కువలయా పీడ మదిపిచ్చి కుంటి యేన్గు కంసునానతి కృష్ణతో కలియబడిన
హరిపదాగ్రహతిని జెంది యసువులీగె చేరి దీపమ్ము పురుగు చచ్చిన విధాన

తాత్పర్యము స్పష్టము

237. యుద్ధమిషాత్ సహ రఙ్గే శ్రీరఙ్గేనాఙ్గసఙ్గమం ప్రాప్య
ముష్టికచాణూరాఖ్యౌ యయతుర్నిశ్శ్రేయసంప్రాప్యమ్

తొడరి చాణూర ముష్టికుల్ మదిసిరపుడు మల్లయుద్ధంపు మిషజేసి మాధవాంగ
సంగసౌభాగ్యమంది రణాంగణమున ముక్తినందిరి పాపవిముక్తులగుచు

చాణూర ముష్టికులు అపజయము నెరుగని మల్లయుద్ధవిశారదులు. వారితో మల్లయుద్ధము చేయుమని బలరామకృష్ణులను కంసుడాదేశింపగా, వారిని ఓడించి పరిమార్చినారు బలరామకృష్ణులు. పరమాత్మస్వరూపులైన వారితో శరీరసాంగత్యము కలిగినందున వారికి ముక్తియే అనుగ్రహమై ప్రాప్తించినది.

238. దేహకృతాదపరాధాత్ ప్రవికుణ్ఠితాంతరాత్మానం
యదువరకులావతంసః కంసం విధ్వంసయామాస

దుష్టచేష్టల దేహమ్ము దూషితముగ మలినవాసనలంతరాత్మను మథింప
కంసుని వధించి పోద్రోలి కలుషములను కరుణ వెలయించి తనలోన కలుపుకొనియె

239. హరిసందర్శనయోగాత్ పృథురణతీర్థే నిమజ్జతే తస్మై
భగవాన్ప్రాదాదాద్యః సద్యః చైద్యాయ సాయుజ్యమ్

హరిసందర్శన యోగ స్ఫురణన్ ఘనయుద్ధ తీర్థమున మునుగుటచే
హరి యాద్యుడు చైద్యునికిన్ పరసాయుజ్యము నొసంగె పరమప్రీతిగా

శిశుపాలుడు చేదివంశపు రాజు. శ్రీకృష్ణునికి మేనత్త కుమారుడు. మేనత్తకు తానిచ్చిన మాటను మన్నించి శ్రీకృష్ణుడు అతని దుర్నయములను నూరింటివరకు సహించి చివరకు యుధిష్ఠిర రాజసూయములో తన అగ్రపూజ్యత్వమును నిందించి క్రోధించిన వానికి

చక్రముతో శిరచ్ఛేదము చేసినాడు. పూర్వము నరసింహావతారములో వీనినే హిరణ్యకశిపునిగా, రామావతారంలో వీనినే రావణునిగా వధించి ఈ అవతారములో వీనికి పునర్జన్మ లేకుండా సాయుజ్యము నిచ్చినాడు.

240. మీనాదిభిరవతారైర్నిహతాః సురవిద్విషో బహవః
సీతాస్తే నిజరూపం తత్ర చ మోక్షస్య కా వార్తా

**ఇల మత్స్యాద్యవతారమ్ముల హరి సమయించె సురరిపుల బలువురి వా**
**కలు సారూప్యముననే జెలగిరి మోక్షమనుట చెప్పగ వలెనే**

పూర్వము మత్స్య, కూర్మ, వరాహాది అవతారములలో హరి అనేకమంది సురద్వేషులను అనగా రాక్షసులను సంహరించెను. వారందరికి సారూప్యముక్తి లభించినది. అదే మోక్షము కదా.

241. యే యదునన్దననిహతాః తే తు న భూయః పునర్భవం ప్రాపుః
తస్మాదవతారాణామ్ అన్తర్యామీ ప్రవర్తకః కృష్ణః

**నందతనయుచే గూలిన యందరును పునర్భవమ్ము నందనె లేదీ**
**చందము పదియవతారము లం దంతర్యామి కర్తయగు కృష్ణుండే.**

యదునందనుని చేత హతులైన యందరు పునర్జన్మ నందనే లేదు. అందువలన కృష్ణుడు సర్వావతారములకు ప్రవర్తకుడు, అంతర్యామి, కేవల పరమాత్మయే. దీనివలన శ్రీకృష్ణావతారము పరిపూర్ణావతారమని రూఢియైనది.

242. బ్రహ్మాండాని బహూని పఙ్కజభవాన్ ప్రత్యణ్డమత్యద్భుతాన్
గోపాన్ వత్సయుతానదర్శయదజం విష్ణూనశేషాంశ్చ యః
శంభుర్యచ్చరణోదకం స్వశిరసా ధత్తే చ మూర్తిత్రయాత్
కృష్ణో వై పృథగస్తి కోఽ ప్యవికృతః సచ్చిన్మయో నీలిమా

**పలు బ్రహ్మాండములన్ సరోజభవులన్ ప్రత్యండ నిర్మాతలన్**
**పలు వత్సంబుల గోపులన్ నలువకై పల్ విష్ణులై జూపె నౌ**
**కల దాల్చున్ శివుడేని పాదజల మాతండే కృష్ణుడీ నీలిమం**
**బెలమిన్ బూర్ణము సచ్చిదాత్మకమునౌ నేమూర్తికిన్ జెందకన్**

వత్సాపహార ఘట్టములో పరమేష్ఠికి ముందుగా తనను గోవత్స, గోపాలబాలక రూపములుగా చూపించి, ఆ తరువాత అందరినీ చతుర్భుజులుగాను, శంఖ చక్రాద్యాయుధధారులుగనూ, తులసీమాలా విభూషితులుగనూ చూపించినాడు. ఇంకా పరికించి చూచితే, శ్రీకృష్ణుని రోమరోమమునుండి అనేక బ్రహ్మాండములు వెలువడుతున్నట్లునూ, ప్రతి బ్రహ్మాండములోనూ పద్మనాభుడూ, నాభిపద్మములో బ్రహ్మ కనుపించినారు. బ్రహ్మకు కన్ను చెదిరి కన్ను మూసి తెరచేలోపల అందరూ మాయమైపోయి, శ్రీకృష్ణుడొక్కడే చేతిలో పెరుగన్నము ముద్ద పెట్టుకుని, చెలికాండ్రను వెదకుతూ ఉన్నట్లుగా కనుపించినాడు. ఇట్టి శ్రీకృష్ణుని పాదములనుండి సంభవించిన గంగను శివుడు నెత్తిమీద పెట్టుకున్నాడు. ఈ వింతలన్నీ చూపించిన కృష్ణుడు ఆయనకు కనుపిస్తూనే ఉన్నాడు. అందుచేత శ్రీకృష్ణుని మూర్తి శుద్ధసత్త్వమయమనీ, రజస్సత్త్వతమో గుణములతో వ్యవహరించే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల మూర్తుల కంటే భిన్నమనీ, ఈ మూర్తి పరిపూర్ణ సౌహార్దమునకు చిహ్నమనీ, సత్ చిత్ మాత్రమనీ, సత్యజ్ఞానానన్ద స్వరూపమే ఆయన యొక్క నీలితేజస్సు అనీ తెలియబడినది.

243. కృపాపాత్రం యస్య త్రిపురరిపురమ్భోజవసతిః
సుతా జహ్నోః పూతా చరణనఖనిర్ణేజనజలమ్
ప్రదానం వా యస్య త్రిభువనపతిత్వం విభురపి
నిదానం సోఽస్మాకం జయతి కులదేవో యదుపతిః

అజుడైన త్రిపురారియైన నెవ్వని కృపా పాత్రులై తమ తమ పదవులంది
రెవ్వని కాల్గోటి నివ్వటిల్లిన జల మ్మది లోకపావనియైన గంగ
ఎవ్వడు సంప్రీతి నిచ్చు బహూకృతి ముల్లోకముల నేలు ముఖ్యపదవి
మా పుణ్యముల పంట మమ్మునేలిన ప్రభుం డీ కృష్ణుడే పరమేశ్వరుండు
గోకులంబును గన్నట్లు మా కులమును దయనుగను పరదైవమీతడె యశోద
కాపుతింతనె జూపించె నఖిల జగము మాకు నఖిలమ్ము దానయై మనుచునెపుడు

తాత్పర్యము స్పష్టము

244. మాయాఽహస్తేర్పయిత్వాభరణకృతికృతే మోహమూలోద్భవం మాం
మాతః కృష్ణాభిధానే చిరసమయముదాసీనభావం గతాఽసి

కారుణ్యైకాధివాసే సకృదపి వదనం నేక్షసే త్వం మదీయం
తత్ సర్వజ్ఞే న కర్తుం ప్రభవతి భవతీ కిం ను మూలస్య శాంతిం

మాయను దాదిజేసి చనుబాపితి నమ్మరొ కృష్ణభూమికన్
హాయవదేల నన్ను? కరుణాభరితాత్మవుగావొ? నా మొగం
బేయిటు చూదరావు! తగునే యిది? జ్ఞానపయః ప్రపూర్ణవే
జ్ఞేయమ నేటి చన్గుడిపి చిత్తమునన్ భ్రమదీర్పజాలవే?

కృష్ణభూమికను పరిగ్రహించిన మా అమ్మవు నీవు. జీవుడనైన నేను భ్రమవల్లనే పుట్టినాను. భ్రమవల్లనే పెరుగుతున్నాను. భ్రమ అంటే మాయయే కనుక, నీ ప్రతిబింబాన్నే అయిన నాకు ఆత్మజ్ఞాన స్వరూపమైన నీ పాలు అందజేయక, మాయ అనే దాదిచేత పాలు ఇప్పించినావు. నీవు కరుణామయురాలవు కదా! నామీద కరుణ చూపించి ఒక్కసారి నా ముఖము చూడవచ్చును గదా! ఇంతకాలమూ ఉదాసీనముగా ఉండి పోయినావు. నీ చనుబాలు పరమాత్మ జ్ఞానసంభరితములు. ఒక్కసారి నీ చనుబాలు త్రావనిస్తే నా చిత్తములోని భ్రమ తొలగిపోయి, నీ వొడిలోనికి చేరుకుంటాను.

245. ఉదాసీనః స్తబ్ధః సతతమగుణః సఙ్గరహితః
భవాంస్తాతః కాఽతః పరమిహభవేత్ జీవనగతిః
అకస్మాదస్మాకం యది నకురుతే స్నేహమిహ తత్
వసస్వ స్వీయాన్తర్విమలజఠరేఽస్మిన్ పునరపి

నీవు నిర్గుణుడవున్ నిస్సంగుడ వుదాసీనతన్ స్తబ్ధతన్ జెలగుచుందు
విట్టి నీవే మమ్ము బుట్టించు పితవన్న బ్రతుకెట్లు మాకింక? పరమమైత్రి
వెలయింపవేని మాకెలన దోషములెన్న కవ్యాజ కరుణా కటాక్షములయ
కనుక నీవిక భవ్యకారుణ్య గుణగణ కలితుడవై మమ్ము గావవలయు

నాడు దేవకి గర్భమ్మునను వసించినట్లు నా యంతరంగమునందు నిలచి
అణగద్రొక్కుము రాగాదులైన రిపుల విమల సత్త్వమ్ము నాలోన పెరగనిమ్ము

శ్రీకృష్ణా! నీవు పరమాత్మవు. అందుచేత నిర్గుణుడవు. సంగరహితుడవు. ఏ విషయమూ పట్టించుకోకుండా ఉదాసీనంగా నిష్క్రియుడవై స్తబ్ధత్వమును అవలంబిస్తున్నావు. అయితే మాకు చైతన్యప్రదుడవై జన్మనిచ్చిన నీకు తండ్రిగా బాధ్యతలు లేవా? నీవు తండ్రివై మా

బాధ్యత స్వీకరించకపోతే మేమెట్లా బ్రతికేది? సౌహార్దమే నీ స్వభావం కదా. అందుచేత మామీద అవ్యాజ కరుణా కటాక్షాలను ప్రసరించి, పరమమైత్రీభావమును ప్రకటించి, మా దోషములను పరిగణింపక (ఎందుకంటే, దోషాలే మాకీ జన్మనిచ్చినాయి. నీ సహాయము లేకపోతే దోషాలు కల్పించిన మాయను తరించలేము) నిర్గుణత్వము మానుకొని పరమ కారుణ్య గుణగణములను అవలంబించి మమ్ము కాపాడు. ఆనాడు దేవకి గర్భంలో నివసించి కంసాది దానవులను సంహరించలేదా? అట్లాగే ఇప్పుడు నీవు మా హృదయాశయము లలో నివసించి, మాలోనే శత్రువులుగా ఉన్న కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను అణగద్రొక్కి, మాకు సత్త్వగుణప్రాప్తి కలిగించి మోక్షము కలిగించు.

246. లోకాధీశే త్వయీశే కిమితి భవభవా వేదనా స్వాశ్రితానాం
సంకోచః పఙ్కజానాం కిమిహ సముదితే మణ్డలే చణ్డరశ్మేః
భోగః పూర్వార్జితానాం భవతి భువి నృణాం కర్మణాం చేదవశ్యం
తన్మే దృష్టః నృపుష్టైః నను దనుజ నృపైరూర్జితం నిర్జితం తే

జగదీశ్వరుని నిన్ను సర్వసమర్థునిన్ బడసి యాశ్రితులకీ బాధలేల
చండ భాస్కరుడుండ సంకోచమందుట కలుగునే యెందైన కమలములకు?
నరుల కవశ్యమున్ భరియింపవలె పూర్వ కర్మమ్ములను మాట కలదటన్న
మరి దైత్యనృపులెట్లు నరమాంస భక్షకుల్ నీచేతనే మరణించి కర్మ
ములు బాసి ధన్యులై ముక్తినందిరి? వారు ఓటమిన్ నిను గెల్చుకొనిరి గాదె?
నిను భజించెదు మము గావు మనవరతము కలదు మా పాపముల మూట
తలకుమించి
ఇది భరింపగ నీవె మా కేదుగడవు కరుణ పర్షించు నైజమ్ముగాదె? నీకు.

శ్రీకృష్ణా! మేమందరము నీ ఆశ్రితులము. "ఒకసారి నన్ను ఆశ్రయించి, నీవాడను నేను అని వేడుకున్నవారికి ఆ క్షణములోనే అభయమిస్తాను. ఇది నాకు వ్రతము" అని రామావతారములో విభీషణ శరణాగతి సందర్భములో చెప్పినావు. నీ మాట ఎప్పటికీ అబద్ధము కాదుగదా! మాకు ఈ లోకములో జన్మ, జరా, మృత్యు భయములు కలుగుతూనే ఉన్నాయి. సూర్యుడు తన చండకిరణాలను వెదజల్లుతూ ఉంటే కమలములు ఇంకా

మూడుచుకొని ఉంటాయా? అయితే అంటావేమో! నరులకు పూర్వజన్మములలో చేసిన కర్మలకు అనుభవము కలిగి తీరాలనే నియతి ఉందని. అయితే ఘోరరాక్షసులు అఘాసురుడు, పూతన, కంసుడు - ఇట్లాంటివాళ్ళు నీచేతనే మరణించి, కర్మబంధములు వదిలించుకొని ముక్తినందినారు కదా! వారు తాము యుద్ధములో ఓడిపోయి కూడా నీ సాయుజ్యమును గెల్చుకున్నారు కదా! ఇంక నిన్నే భజిస్తూ ఉన్న నీ భక్తులమైన మమ్ములను నీవే రక్షింపవలెను. మా పాపాలన్నీ ఎన్నో జన్మలనుండీ సంతరించుకొన్నవి, మేము మోయలేనంత బరువుగా ఉన్నాయి. ఈ బరువు దించడానికి నీవే మాకు దిక్కు. నేను "పరమకారుణికుడను" అని గోపికలతో చెప్పినావు కదా! ఆ కరుణ మామీద చూపించు.

247. నిత్యానన్దసుధానిధేరధిగతః సన్నీలమేఘః సతామ్
 ఔత్కణ్ఠ్యప్రబలప్రభఞ్జనభరైరాకర్షితో వర్షతి
 విజ్ఞానామృతమద్భుతం నిజవచోధారాభిరారాదిదం
 చేతశ్చాతక! చేన్న వాంఛసి మృషా క్రాన్తోసి సుప్తోఽసి కిమ్

 పరమానన్ద సుధాబ్ధిపై విరియు సత్త్వమ్మౌ వినీలాభ్రమే
 పరసద్భక్తి రసాతిరేక బలవత్ వాతాహృతంబై యిటన్
 వరిసెన్, జ్ఞానసుధాప్రపూర్ణ వచనోద్గారంబు వర్షింప నీ
 వరయన్ లేవాకో? చిత్త చాతకమ! నిద్రాలస్య సంభ్రాంతమా!

పరమాత్మ సచ్చిదానందమయుడు, సర్వవ్యాపి కనుక పరమానంద సుధాబ్ధి అతడే. ఆ అమృత సముద్రమునుండి జ్ఞానానందామృతమును సేకరించిన నీలమేఘము శ్రీకృష్ణుడే. ఆ నీలమేఘము సత్పురుషుల యొక్క భక్తి పారవశ్యము అనే బలమైన వాయువుల వల్ల మన లోకానికి వచ్చినది. యుద్ధభూమిలో అర్జునునికీ, ఈ లోకములో తాను ప్రదర్శించిన నాటకము యొక్క చరమాంకములో ఉద్ధవునికీ శ్రీకృష్ణుడు విస్తృతముగా జ్ఞానబోధ చేసినాడు. ఆయన వచనామృతము వ్యాసభగవానుని అనుగ్రహము వల్ల ఈనాటికీ భక్తులను ఉద్ధరించడానికి వర్షిస్తూనే ఉన్నది. నా చిత్తము అనే చాతకమా! చాతకము యొక్క స్వభావము వర్షపు నీటితోనే దప్పి తీర్చుకుంటూ, మేఘము ఎప్పుడు వర్షిస్తుందా అని నిరీక్షించడమే. అట్టి నీవు ఈ జ్ఞానామృతాన్ని ఆస్వాదించడము లేదంటే, నీకు నిద్ర అన్నా ఆవరించి ఉండాలి లేకపోతే సంసారమందలి పరిభ్రమణము చేత ఆయాసము అయినా వచ్చి ఉండాలి.

248. చెతశ్చత్వలతాం విహాయ పురతః సంధాయ కోటిద్వయం
తత్రైకత్ర విధేహి సర్వవిషయానన్యత్ర చ శ్రీపతిం
విశ్రాన్తిర్హితమప్యహో క్వ ను తయోర్మధ్యే తదాలోచ్యతాం
యుక్త్యా౽ నుభవేన యత్ర పరమానన్దశ్చ తత్ సేవ్యతామ్

**మనమా పర్వులు మాని ముందటను సంభావింపు కోటిద్వయ**
**మ్మును నందొక్కటనుంచు సర్వవిషయమ్ముల్ వేరిటన్ శ్రీపతిన్**
**వినుమాపై నగుదేన నీకు హితమున్ విశ్రాంతి ఈ రెంటిలో**
**గను మాలోచన యుక్తులన్ నను భవఖ్యాతిన్ పరానన్దమెం**
**దున సంభావ్యమొ దానినే మిగుల సంతోషంబునన్ జేరుమా**

మనస్సా! నీవు కొంచెము స్థిరత్వమును అవలంబించి, నీలోనే ఒక త్రాసును ఏర్పాటుచేసుకో. అందులో ఒక ప్రక్క అన్ని విషయాలు అంటే ఈ లోకములోనూ, స్వర్గలోకంలోనూ కోరుకోదగిన సుఖం ప్రాప్తింపజేసే విషయాలను అన్నిటినీ ఉంచు. రెండవ ప్రక్క పరమాత్మ స్వరూపుడైన శ్రీకృష్ణుని ఉంచు. ఇప్పుడు త్రాసు ఎటువైపు మొగ్గుతుందో ఆలోచించు. ఈ ఆలోచనలో నీకు తెలిసిన యుక్తులూ, అనుభవాలను కూడా క్రోడీకరించు. యుక్తి అంటే విషయాలు శరీరముతోటే అనుభవించాలి. ఈ శరీరమూ శాశ్వతము కాదు, ఏలోకములోనైనా భోగాలు శాశ్వతము కావు. ఇవి అన్నీ కర్మ జన్యములే. ఆ కర్మకు నిర్దేశించిన ఫలము కాలక్రమేణ క్షీణించి నశిస్తుంది. అయితే శ్రీకృష్ణుడు పరమాత్మస్వరూపుడు కనుక, పరమాత్మలో ఉన్న అఖండానందము విషయాలను పరిహరించిన మనస్సువల్లనే లభిస్తుంది. ఈ ఆనందము కర్మసాధ్యము కాదు. ఎందుకంటే కర్మ అంటే ఆయా శరీరములతో, అంటే నశ్వరమైన శరీరములతో, తాదాత్మ్యము చెందిన బుద్ధితో, ఈ శరీరమే నేను అనే బుద్ధితో, మాయామయమైన జగత్తుతో వ్యవహారమే. తాత్కాలికంగా సుఖము ప్రసాదించినా ఇది జగత్తు సత్యమనే భ్రాన్తిని పెంచుతుంది. అయితే ప్రతిజన్మలోనూ నీవు నివసించే శరీరమూ, జగత్తూ కూడా మరణం వరకే ఉంటాయి. మరణానన్తరం మరో శరీరమూ, దానితో ఇంకొక జగత్తుతోనూ వ్యవహరించవలెను గనుక, ఇప్పుడున్న శరీరమూ జగత్తూ మాయా మయములే కనుక ఈ కర్మలన్నీ మాయామయములే. ఎందుకంటే పరమాత్మలోని సౌఖ్యము విషయములను పరిత్యజిస్తేనే వస్తుంది. కర్మలన్నీ విషయానుభవము మీద ఆసక్తిని పెంచేవిగానే ఉంటాయి.

అందుచేత పరమాత్మ సౌఖ్యమే విషయానందము కంటె ఉత్కృష్టమూ, శాశ్వతము అనే యుక్తి సరిపోయింది. అట్లాగే, అనుభవము కూడా ఉన్నది. మనకు శారీరకముగాగాని, మానసికముగాకాని ఎన్ని బాధలు ఉన్నా, ఇవన్నీ గాఢసుషుప్తిలో మరచిపోయి, పరమాత్మలోని నిత్యానందాన్ని అనుభవిస్తాము. ఈ ఆనందము విషయములను పరిహరించడం వల్ల వచ్చినదే కదా. అందుచేత ఓ మనస్సా! నీవు పరిభ్రాన్తితో ఇటూ, అటూ పరువెత్తక విషయానందములను పరిహరించి, నిత్యానంద స్వరూపుడైన శ్రీకృష్ణనే ఆశ్రయించు. ఇదే నీకు అత్యన్తమైన శ్రేయస్సును అంటే మోక్షమును కల్పిస్తుంది.

249. పుత్రాన్ పౌత్రమథస్త్రియోఽ న్యయువతీర్విత్తాన్యథో-న్యద్ధనం
భోజ్యాదిష్వపి తారతమ్యవశతో నాలం సముత్కంఠయా
నైతాదృగ్యదునాయకే సముదితే చేతస్యనన్తే విభౌ
సాన్ద్రానన్దసుధార్ణవే విహరతి స్వైరం యతో నిర్భయమ్

కొడుకుల్ మన్మలు నాండ్రు నన్యయువతుల్ కోడండ్రు స్వార్థముల్
పడుపుల్ వీరల కెచ్చుతగ్గుల వృథా క్షోభమ్ము నారాట మా
క చెడన్ గల్గిన యాదవేశుని ననంత శ్రీయుతున్ కృష్ణునిన్
జడియం దేతరి ధన్యుడై చెలగు స్వేచ్ఛాచార సంచారియై
యడరున్ కేవల మద్భుతాద్భుతము సాన్ద్రానంద పూర్ణస్థితిన్

ఈ సంసారములో ఎంతటి వైభవము ఉన్నా, ఎంతమంది పరివారము ఉన్నా, కొడుకులూ, మనుమలూ, భార్యలూ, కోడండ్లు అన్నిరకములైన భోగ్యవస్తువులూ ఉన్నా, వీటి అనుభవములో కొంతమందికి తారతమ్యభావము తప్పదు. అందుచేత మనస్సుల క్షోభము కూడా తప్పదు. ఇవన్నీ లేకపోయినా, శ్రీకృష్ణుని యందు ప్రీతిభావముతో, ఆయననే హృదయములో నింపుకునే భక్తుడు ధన్యుడూ, స్వేచ్ఛాప్రవృత్తి కలవాడూ (తనవారు, తమకోసము తనను నియమించకుండా), అయివుండి ఎవరివల్లనూ భయపడడు. ఎందుకంటే, అతనికి కృష్ణానుభూతి స్వరూపమైన, స్వచ్ఛమైన రాగద్వేష విరహితమైన ఆనందము కొల్లలుగా లభిస్తుంది.

250. కామ్యోపాసనయార్థయన్త్యనుదినం కించిత్ ఫలం స్వేప్సితం
కించిత్ స్వర్గమథాపవర్గమపరైర్యోగాదియజ్ఞాదిభిః

అస్మాకం యదునన్దనాఙ్ఘ్రియుగలధ్యానావధానార్థినాం
కిం లోకేన ధనేన కిం నృపతినా స్వర్గాపవర్గైశ్చకిమ్

**అనుదినమర్థి చేసెద రుపాసన లల్పఫలానురక్తులై**
**పనివడి నిర్వహింతు రపవర్గముకై బహుయోగయజ్ఞముల్**
**మనమిది కృష్ణ సంభృతము మా కపవర్గము స్వర్గమేనియున్**
**గనబడవింక ప్రీతిరసగాఢము తృప్తము చిత్తమింక నే**
**జనులు నృపాలురేల? బహు సంపదలేల? సమృద్ధమంతయున్**

కోరికలు సమకూరడానికి దేవతల నుద్దేశించి ఉపాసనలు చేస్తారు. వారు కోరే కోరికలు చిన్నచిన్నవి. కొంచెము బంగారము కోరుకుంటారు. యజ్ఞములు చేస్తారు. మోక్షము కొరకు యోగాభ్యాసము చేస్తారు. అయితే మాకు అట్టి ఉపాసనలూ, యజ్ఞాలూ, యోగాలు రుచించవు. ఎందుకంటే మేము మనస్సంతా కృష్ణునితో నింపుకొనియున్నాము. ఆయన పాదములే ధ్యానిస్తూ ఏకాగ్రతను కోరుకుంటున్నాము. మాకు స్వర్గము కాని, అపవర్గము (మోక్షం) కాని కోరదగినవిగా కనుపించడము లేదు. మా హృదయములు కృష్ణప్రీతిని చెంది ఆయన అనుగ్రహము వల్ల తృప్తి వహించినవి. మాకీ లోకముతోగాని, నృపాలురతోగాని, సంపదలతో కానీ పనిలేదు.

251. ఆశ్రిత మాత్రం పురుషం స్వాభిముఖం కర్షతి శ్రీశః
లోహమపి చుమ్బకాశ్మా సంముఖమాత్రం జడం యద్వత్

**తను నాశ్రయించు మాత్రమ్మున నాకర్షించుకొనును పురుషుని శ్రీశుం**
**డినుమున్ జడమయ్యును దన నను వర్తింపగజేయు నయస్కాంతమనన్**

"నీవాడను నేను నీవే నాకు రక్షకుడవు" అని తనను ఆశ్రయించిన వాని నెవరినైనను అభయమిచ్చి తనవానినిగా స్వీకరిస్తాడు భగవానుడు. కృష్ణ నామధేయము ఆశ్రితులను ఆకర్షించుకొను స్వభావము చేతనే వచ్చినది. నిజానికి ప్రతి జీవికూడా మాయావరణము లేకపోతే పరమాత్మకంటే వేరు కాదు కదా! నన్ను ఆశ్రయించినవారు ఈ మాయను తరిస్తారు అని శ్రీకృష్ణుడు భగవద్గీతలో చెప్పినాడు. అందుచేత బాహ్యదృష్టిని మాని, అంతర్దృష్టిని అవలంబించినవారిని తనవైపు ఆకర్షించుకొని మెల్లమెల్లగా మాయను దూరము చేయడం ఆయన స్వభావము.

252. అయముత్తమో౽ యమధమో జాత్యా రూపేణ సంపదా వయసా
శ్లాఘ్యో౽ శ్లాఘ్యో వేత్థం న వేత్తి భగవాననుగ్రహావసరే

జనులన్ వయసున రూపమునను జాతిని సంపదలను దరతమ దృష్టిన్
గన దచ్యుతు డిత డుత్తముడని యధముండని యనుగ్రహము సేయు తఱిన్

జాతి, రూపము, సంపద, వయసు, ఉత్తమత్వము, అధమత్వము ఇలాంటి విషయములేవీ భగవదనుగ్రహము ప్రాప్తించడానికి అడ్డురావు. "శ్వపచుడైనా సరే మనోర్థప్రాణ వాక్కర్మములు సమతన్ విన్ను నయించెనేని" ముఖ్యుడవుతాడనీ, నిజవంశశ్రీకరుడవుతాడనీ ప్రహ్లాదుడు చెప్పినాడు.

ఈ శ్లోకమునకు వివరణ భగవానుడే తన మాటలలోనే తెలవిచ్చినాడు. (భాగవతము ఏకాదశస్కంధము ద్వాదశాధ్యాయము శ్లోకసంఖ్య 1 నుండి 8వరకు)

శ్రీ భగవానువాచ

1. న రోధయతి మాం యోగో, న సాంఖ్యం ధర్మ ఉద్ధవ!
న స్వాధ్యాయస్తపస్త్యాగో నేష్టాపూర్తం న దక్షిణా

2. వ్రతాని యజ్ఞశ్ఛందాంసి తీర్థాని నియమాః యమాః
యథా-వరున్ధేత్ సత్సఙ్గః సర్వసఙ్గాపహో హి మామ్

శాస్త్రోక్తములైన ఇతర ధర్మముల కంటెనూ, యమనియమముల కంటెనూ సత్సంగమే నన్ను కట్టివేస్తుంది. ఇక్కడ సత్సంగము అంటే సత్ పదార్థమైన తనతో మాత్రమే వ్యవహారము. తనకంటె ఇతరమైన పదార్థములన్నీ లేనివే అని భావించడము. అదే అనన్యభక్తి. భగవంతునికి సత్స్వరూపము కంటె వేరే రూపము లేదు. వేరేగా ఉన్నది అని స్ఫురించే వస్తువులన్నీ మాయవల్ల రజ్జువులో సర్పం స్ఫురించినట్లే స్ఫురిస్తాయి. ఇట్టి సత్సంగము, జగత్తులోని ఇతర సంగములన్నిటినీ అపహరిస్తుంది. అందుకే సర్వసంగాపహమే కదా సత్సంగము అన్నాడు భగవంతుడు. "సత్సంగః సర్వసంగాపహోహి". "యథావరుంధేతమాం" అంటే సత్సంగము నన్ను కట్టివేసినట్లు ఇతర ధర్మములేవీ నన్ను కట్టివేయలేవు అని స్వయముగా చెప్పినాడు. ఇతర ధర్మములేవి అంటే చెప్పినాడు, అవి: యోగమూ, సాంఖ్యమూ, స్వాధ్యాయమూ, తపస్సూ, త్యాగమూ, అగ్నిహోత్రవిధులు,

కూప తటాకాది నిర్మాణము, దానములు, వ్రతములు, యజ్ఞములు, రహస్యముగా జపించే మంత్రములు, తీర్థయాత్రలు, అంతరింద్రియ నిగ్రహము, బాహ్యేంద్రియ నిగ్రహము. కేవలము తానే సత్పదార్థము అనే భావముతో, అంటే అనన్య భక్తితో అందరూ తనను చేరుకున్నారని మళ్లీ 8వ శ్లోకంలో చెప్పినాడు.

3. సత్సఙ్గేన హి దైతేయాః యాతుధానాః ఖగాః మృగాః
   గంధర్వాప్సరసో నాగా సిద్ధచారణగుహ్యకాః

4. విద్యాధరా మనుష్యేషు వైశ్యాః శూద్రాః స్త్రియోన్త్యజాః
   రజస్తమఃప్రకృతయః తస్మిన్ తస్మిన్ యుగే యుగే

5. బహవో మత్పదం ప్రాప్తాః త్వాష్ట్రకాయాధవాదయః
   వృషపర్వా బలిర్బాణో మయశ్చాథ విభీషణః

6. సుగ్రీవో హనుమాన్ ఋక్షో గజో గృధ్రో వణిక్పథః,
   వ్యాధః కుబ్జా వ్రజే గోప్యో యజ్ఞపత్న్యః తథా పరే

7. తే నాధీతశ్రుతిగణాః నోపాసితమహత్తమాః
   అవ్రతాతప్త తపసః సత్సఙ్గాత్ మాముపాగతాః

8. కేవలేన హి భావేన గోప్యో గావో నగా మృగాః
   యేఽన్యే మూఢధియో నాగాః సిద్ధాః మామీయురఞ్జసా

సత్స్వరూపుడనైన నాతో ఏర్పరుచుకొన్న సంగమువల్లనే దైత్యులు, రాక్షసులూ, పక్షులూ, మృగములూ, గంధర్వులూ, అప్సరసలు, నాగులూ, సిద్ధులూ, చారణులూ, యక్షులూ, విద్యాధరులూ, మనుష్యులూ, వైశ్యులూ, శూద్రులూ, స్త్రీలూ, అన్య కులస్థులూ, వీరందరూ రజస్తమోగుణములే స్వభావముగా కలవారైననూ ఆయా యుగములలో ఎంతోమంది నా స్థానమును పొందినారు. వారిలో ముఖ్యులను వివరిస్తున్నాడు భగవంతుడు. వృత్రాసురుడు, ప్రహ్లాదుడు, వృషపర్వుడనే రాక్షసరాజు, బలిచక్రవర్తి, బాణాసురుడు, మయాసురుడు, విభీషణుడు, వానరులలో సుగ్రీవుడు, హనుమంతుడు, ఎలుగుబంట్లలో జాంబవంతుడు, గృధ్రమైన జటాయువు, వణిక్ పథుడైన తులాధారుడు, వ్యాధులలో ధర్మవ్యాధుడు, సాధారణ స్త్రీలలో కుబ్జ, గోకులములో గోపికలు, యజ్ఞపత్నులు (భర్తలు నిరాకరించినా శ్రీకృష్ణునికి వనములో భోజనము తీసికొనిపోయిన యజ్ఞదీక్షితుల భార్యలు).

వీరందరూ శ్రుతులను అభ్యసించనివారైనా, మహాత్ములను ఉపాసించనివారైనా, వ్రతదీక్షితులు కాకపోయినా, తపస్సులు నిర్వహించకపోయినా, సత్‌సంగాత్ అనగా సత్‌స్వరూపుడనైన నాయందు ఏర్పరుచుకొన్న ఆసక్తివల్లనే నన్ను చేరుకున్నారు. కేవలమైన భావముతోనే అనగా, కేవలము నేనే ఈ జగత్తులో తమకు సంబంధించినవాడను అనే నిశ్చయముతో గోపికలు, గోవులు, వృక్షములు, మృగములు ఇంకా ఇతరులైన మూఢబుద్ధులు నన్ను ప్రాప్తించుటలో సిద్ధులైనారు. వ్రజభూమియందలి మృగములు, గోవులు, వృషభములు శ్రీకృష్ణుని వేణుగానము తమ మనస్సులను హరింపగా చెవులు రిక్కించి, దంతములతో తృణములు కొరుకుతునే, చిత్తరువులవలె అయిపోయినారు అని గోపికలు వర్ణించినారు. అట్లాగే ఆయన వేణునాదము వింటున్న హంసలు, ఇతర పక్షులు తన్మయత చెంది ఆయన వద్ద చేరి సేవించినవి అని గోపికలే వర్ణించినారు. అట్లాగే ఆడలేళ్ళు ఆయన వేణుగానమునకు మోహితులై ఆయనను వెంబడించినవి. అన్ని యజ్ఞములు, ఇతర ధర్మకార్యములు మనుష్యులలో రజస్తమో గుణములను నిర్మూలించే ప్రయత్నములు. అయితే రజస్తమో గుణములే తమ స్వభావమైన మూఢ, తిర్యక్ జాతులు కూడా శ్రీకృష్ణుని రూపమువల్ల గానమువల్ల ఆకర్షింపబడి ఆయనయందు తన్మయత్వము చెంది అప్రయత్నముగానే తమలోని రజస్తమో గుణములను నిర్మూలించుకున్నారు.

253. అన్తస్థభావభోక్తా సోఽన్తర్యామీ మహామేఘః
ఖదిరశ్చంపక ఇతి వా ప్రవర్షణే కిం విచారయతి

లోభావ మారగించెడి వైభవమది యంతరాత్మ భావము మేఘ
మ్మా భంగిఁ జంద్ర సంపెగ, యీ భేదము వాన కురియునపు దరయునటే.

భగవానుడు అంతఃకరణము యొక్క పరిపక్వతను పరిశీలిస్తాడు. ఆయన అంతరాత్మ గనుక తనయందలి భక్తి యొక్క పారిశుద్ధ్యమును తెలుసుకొనియే అనుగ్రహిస్తాడు. బాహ్యములైన భేదములను పరిగణింపడు. మహామేఘునివంటివాడు, చంద్రవృక్షము, సంపెంగ వృక్షము ఈ రెండూ కూడా సమానముగానే వర్షజలమును పొందుతాయి.

254. యద్యపి సర్వత్ర సమః తథాపి నృహరిః తథాప్యేతే
భక్తాః పరమానన్దే రమన్తి సదయావలోకేన

అందరిలో హరిసముడై వస్ దన కరుణార్ద్ర దృష్టి నరసిన భక్తుల్
స్పందింతు రాత్మ పరమా, నందమ్మును గనుటచేత నమిత ప్రీతిన్

పరమాత్మయైన శ్రీకృష్ణుడు అందరి యందు సమానముగానే వర్తిస్తాడు. అయినా ఆయన కరుణాభరితమైన దృష్టిని కృష్ణప్రీతితో ఉన్న భక్తులు తెలుసుకొని పరమానందముతో స్పందిస్తారు.

255. సుతరామనన్యశరణాః క్షీరాద్యాహారమన్తరా యద్వత్
కేవలయా స్నేహదృశా కచ్ఛప తనయాః ప్రజీవన్తి

పాలు లేవు లేరు పాలించువారైన ప్రేమదృష్టి నెరపి పెంచుకొనును
పిల్ల కచ్ఛపమును తల్లి దూరము నుండి హరిదయార్ద్ర దృష్టినటులె బ్రోచు

తాబేలు తన పిల్లలకు పాలిచ్చి పెంచదు. దూరమునుండి ప్రేమతో వీక్షిస్తుంది. పిల్లలు సంతృప్తులై పెరుగుతాయి. సర్వసమర్థుడైన శ్రీహరికి తన భక్తులను పాలించదానికి ఆయన కృపాదృష్టియే చాలును.

256. యద్యపి గగనం శూన్యం తథాపి జలదామృతాంశురూపేణ
చాతకచకోరనామ్నో ర్దృఢభావాత్ పూరయత్యాశామ్

శూన్య మాకసమ్ము శుద్ధ విశ్వాసమే మొయిలు వెన్నెలలను పొసగజేసి
చాతకమ్ము చకోరమూ తన్మయస్థితిన్ బడసె తమకు వలయు వాంఛితమ్ము

257. తద్వద్ భజతాం పుంసాం దృగ్వాఙ్మనసామగోచరోఽ పి హరిః
కృపయా ఫలత్యకస్మాత్ సత్యానన్దామృతేన విపులేన

అట్లే భగవంతుడు తన పట్లన్ దృఢమైన భక్తి భావము నెపుడున్
ఎట్టైన నిలుపువారికి గట్లన్నియు దాటి వచ్చు కరుణార్ణవమై

సచ్చిదానంద మయ సుధాసంభృతముగ అంతరంగమ్ము నొనరించి సంతసమున
జ్ఞానకర్మేంద్రియమ్ముల గానరాని తనను తానె సమర్పించుకొనును ప్రీతి

చాతకము, చకోరము పక్షులు. చాతకమునకు మేఘము కావాలి. వాననీరే తాగుతుంది కనుక. చకోరమునకు వెన్నెలయే కావాలి. తమ కోరిక తీరదానికి వారు దృఢవిశ్వాసముతో ఆకాశము వైపే చూస్తూ ఉన్నందున మేఘము బయలుదేరి వాన కురిపించినది. చంద్రుడు బయలుదేరి వెన్నెల కురిపించినాడు.

అట్లాగే భగవంతుడు కరుణార్ణవుడు గనుక తనపట్ల విశ్వాసము గల భక్తుల కోరికలను,

తాను ఏర్పరుచుకున్న నియమములు కూడా ఉల్లంఘించి తీరుస్తాడు. ఇందుకు తార్కాణము భారతములో ఉన్నది. కృష్ణుడు చక్రము, ధరింపను ఊరికే అర్జునుని రథము మీద ఉండి సారథ్యము చేస్తానని ప్రతిజ్ఞ చేసినాడు. తాను శ్రీకృష్ణునిచేత చక్రము ధరింపజేసే విధముగా పరాక్రమము చూపిస్తానని భీష్ముడు కూడా ప్రతిజ్ఞ చేసినాడు. భీష్ముని ప్రతిజ్ఞను నిలబెట్టడానికి కృష్ణుడు తన ప్రతిజ్ఞనే ఉల్లంఘించి చక్రము ధరించి ఉద్వేగమును నటించినాడు.

భగవంతుడు జ్ఞాన కర్మేంద్రియములకు గోచరింపకపోయినా అందరి అంతరంగాలలో నివసిస్తాడు. భక్తుల భక్తిదారుఢ్యతకు మెచ్చి వారి మనస్సులను సచ్చిదానందములతో నింపుతాడు. దాని అర్థం మాయను అతిక్రమించి ఆయనను చేరుకున్నట్లే.

# ఉపసంహారము

తన భక్తుల యెడల శ్రీకృష్ణుని ప్రవర్తనము, రాసపంచాధ్యాయిలో, గోపికలతో శ్రీకృష్ణుని సంభాషణలో వ్యక్తమవుతుంది. రాసలీలా మహోత్సవమునకు ముందు, శ్రీకృష్ణుడు వారితో కొంత తడవు క్రీడించి, వారికి తమ ధన్యతను తలచుకొని పొంగి పోయి, గర్వము అంకురించిన తరుణంలో అదృశ్యుడవుతాడు. ఆ సమయములో గోపికల పరిదేవనము, గోపికా గీతలు అని భాగవతములో ప్రసిద్ధమైనది. వారి అభిమానము ఉపశమించిన తరువాత శ్రీకృష్ణుడు తిరిగి ప్రత్యక్షమైనపుడు గోపికలు ఆనందపరవశలై ఆయనను స్వాగతించి, కొంచెము కోపముతో, అమాయికముగా లోకవృత్తాన్తమును అడిగినట్లు ఇట్లు అడుగుతారు.

"కొలిచిన కొలుతురు కొందరు గొలుతురు తము గొలువకున్న గొందరు పతులా
గొలిచినను గొలువకున్నను గొలువరు మఱికొందరెలమి గోపకుమారా!"

అని తమ్ముద్దేశించి రహస్యముగా బలికిన సుందరుల పలుకులు విని గోపాలసుందరు డిట్లనియె

"కొలిచిన గొలుతురు కొందరు పశువుల,
భజనము భంగిని ఫలము కొరకు
నై, సఖ్యధర్మంబులందు సిద్ధింపవు;
కొందరు తండ్రుల గుణముదాల్చి,
దయగల వారలు తగిన సువృత్తులు.
గొలువని వారల గొలుతురెపుడు
ధర్మకామంబులు దనరంగ; కొందరు
కొలువని వారిని గొలుచువారి,

గొలుచు తలపులేమి గొలువరాత్మారాము, లాప్తకాములజ్ఞాలతి కరిసులు,

వారియందు పిదప వానిగా జింతించియే, లతాంగులార! యిట్లులనుట,

కం॥ మేనిందెవ్వదనయినం గా నంగనలార! పరమకారుణికుడన్

మానసబంధుడ, నిత్యధ్యానము మీకొసగవలసి తలగితి జుండీ".

(ఆంధ్రభాగవతము, పోతనామాత్య ప్రణీతము)

తన స్వంత ధనము పోగొట్టుకున్న నిర్ధనుడు, ఆ ధనము తిరిగి ప్రాప్తించేందుకు మనస్సు ఎలా లగ్నం చేస్తాడో, అట్లాగే ప్రాపంచిక విషయములలో ఆత్మ అనే ధనమును పోగొట్టుకున్న మనుష్యుడు, మళ్లీ ఆత్మధనమే అయిన తనను నిరంతరమూ ధ్యానించుతూ మనస్సు లగ్నం చేయాలనే తాను వారి హృదయాలలోనే ఉంటూ దృష్టిపథము నుంచి దూరమవుతాడు. లోకాన్ని, వేదధర్మాన్ని, స్వంతవారినీ తృణీకరించి తనను చేరుకున్న భక్తుల ఏకాగ్రత తానెప్పుడు మరువననీ, వారి హృదయములో తానెప్పుడూ నివసించి, వారు తనను శాశ్వతముగా చేరుకునేందుకు సహకరిస్తాననీ చెప్పినాడు. భగవద్గీతకు ఉపసంహారాత్మకముగానూ శ్రీకృష్ణుడు ఇదే చెప్పినాడు. సర్వ ధర్మములు, అంటే లోక, వేద, స్వీయ ధర్మములను పరిత్యజించి, సర్వాత్మగా నన్నే శరణందమనీ, అట్టివానికి ధర్మభ్రంశరూపములైన అన్ని పాపముల నుండి విడుదల కల్పిస్తాననీ చెప్పినాడు.

గోపికలు భగవద్భక్తికి ప్రశస్త నిదర్శనములని నారదుడు భక్తి సూత్రములలో ఉద్ఘాటించినాడు. ఉద్ధవుడు వారి పాదధూళికి నమస్కరించినాడు. భాగవతములోని శ్లోకము: "వందేనందవ్రజ స్త్రీణాం పాదరేణు మభీక్ష్ణశః, యాసాం హః కథోద్గీతం, పునాతి భువనత్రియం". భగవద్భక్తియందలి వారి ఏకాగ్రత ఈ క్రింది పద్యములలో వివరించబడినది.

నందగోకుల సుందరుల్ హరి దన్మయస్థితి జెందుచున్
మందలో దధిమంథనాదుల మాధవార్పిత చిత్తతన్
గ్రందుకొన్న తదీయ లీలల గాన వైఖరి యాకసం
బందఁబాడుదు రన్ని లోకంబులందు శ్రేయము నిండగన్

వందనంబిడి గోపికాతలి పాదధూళికి నిత్యమున్
సుందరున్ భువనాంతరాత్ముని శుద్ధసాత్త్విక విగ్రహున్
జెంది యా స్మృతులన్ మెలంగు విశిష్ట చిత్తము దాల్చుటన్
వందనార్హులు వారికిన్ సరి భక్తవర్యులు లేరిలన్

ఈ విధంబుగ బల్కె నుద్ధవుడింగితజ్ఞుడు శౌరికిన్
దా వియచ్చరమంత్రి శిష్యుడు ధన్యుదుత్తమ భక్తుదున్
భావితాత్ముడు కృష్ణు దుత్తమ భక్తితత్త్వము దెల్పగన్
కోవిదున్ దన ప్రాణమిత్రుని గోరె దౌత్యము సేయగన్

ద్విధాభక్తి ప్రకరణములో సూక్ష్మభక్తిని గురించి చెప్పినదంతా భగవద్గీతలో భక్తియోగము అనే ద్వాదశాధ్యాయములో చెప్పబడిన గుణాలకు సరిపోతాయి. శ్రీమద్భాగవతములో మొదటి శ్లోకములో గాయత్రీ మంత్రార్థాన్ని ప్రస్తుతించి, రెండవ శ్లోకములో భాగవతము యొక్క మోక్షధర్మ ప్రస్తుతిని ప్రకటిస్తూ, అందు చెప్పిన భాగవత ధర్మాలు వేదధర్మాలవలె, స్వర్గమర్త్యలోకాల మధ్య ప్రయాణింపజేసేవి కాక, భగవంతుని లీలలయందు ప్రీతిని కల్పించి, భగవంతుడినే తమ హృదయములలో బంధించుకునే సౌలభ్యము కల్పించునవని వ్యాసభగవానులు చెప్పినారు.

ధర్మః ప్రోజ్ఝితకైతవోఽ త్రపరమో నిర్మత్సరాణాం సతాం
వేద్యం వాస్తవమత్ర వస్తు శివదం తాపత్రయోన్మూలనమ్
శ్రీమద్భాగవతే మహాముని కృతే కిం వా పరైరీశ్వరః
సద్యో హృద్యవరుధ్యతే-త్ర కృతిభిః శుశ్రూషుభిస్తత్క్షణాత్

ఈ భాగవతము సగుణభక్తి నిరూపణమై, నిర్గుణమైన పరమాత్మ కంటే వేరుకాని శ్రీకృష్ణుడు స్వేచ్ఛాగృహీత శుద్ధ సాత్త్విక విగ్రహుండనీ, ఆయన ఆరాధన మోక్షదాయకమనీ చెప్తుంది. ఈ విషయమే శంకరాచార్యులవారు సగుణ నిర్గుణయోరైక్య ప్రకరణము నందు విపులీకరించినారు. శ్రీ శుకులవారు పరీక్షిన్మహారాజుకు భాగవతము వినిపిస్తూ అనేక సందర్భాలలో చెప్పినారు. ఈ క్రింది పద్యాలు ఈ భావాలనే వివరిస్తాయి.

సందర్భంబుల బట్టి శ్రీశుకుడు రాజన్యున్ ప్రబోధించునే
సందేహంబులు మాన్పి కృష్ణుని మనుష్యత్వంబ సత్యంబుగా
నన్, దేహంబును శుద్ధ సత్త్వమయతన్ దాల్చున్ దయాపూర్ణతన్
మన్నప్రజ్ఞులు ధ్యానమాత్రముననే మాయన్ దరింపన్ ధరన్
ధర్మంబులు విధికైతవ మర్మజ్ఞత సృష్టి జేసె మాయామయతన్
నిర్మించె సుఖము దుఃఖము కర్మంబులు స్వర్గమర్త్య గత్యర్థములన్

పరవస్తువు దెలిపెడిదిన్ పరమేశ్వరు హృదయమందు బంధించెడిదిన్
పరునిన్ జేర్చెడి ధర్మమె పరమంబని చాటు భాగవత మీ ఇలలో
మాత్సర్యరహితు లాధ్యులు సత్సంగతి భాగవతము శ్రవణమొనర్చన్
తత్సంవిత్ సుఖసారము హృత్సంగతమై భవమ్ము నెడలన్ ద్రోచున్.
భగవద్ధర్మము మేలిది త్రిగుణాత్మక ధర్మకర్మ రీతుల కంటెన్
భగవంతుని హరిందనలో సగుణాత్మక భక్తి గొల్చి సాధించుటచే
తను వేరని, హరి వేరని కననీని యనన్య భక్తిఁ గని తనుమనముల్
తన కర్పించిన ధన్యుని తనలోనికి జేర్చుకొనును తదనన్యుండై
త్రిగుణాత్మక ధర్మంబుల తగవిడివడి తననె శరణతన్ జెందిన యా
భగవంతుడె భవభారము పెగలించి కృతార్థుజేయు ప్రీతిన్ జనులన్
నెలకొని సర్వాత్మతలో నెలమిన్ హరిగాని యితర మేదైన భ్రమా
విలమని తెలిసిన ధన్యుడు నిలచునె? త్రైగుణధర్మనిరతిన్ జడుడై
ఇలలో పరలోకములో కలుగంగల భోగమందుగని మిథ్యాత్వం
బిలవడు భక్తి యనన్యము తలగదు త్రైగుణ్య మంతదనుకన్ ధరలో

జ్ఞానవైరాగ్యములతో గూడిన శ్రీకృష్ణభక్తి మోక్ష ప్రదాయకమని శంకరాచార్యుల వారు ప్రబోధసుధాకరములో తన తల్లికి బోధించి ఆ బోధనే మనకు అందజేసినారు. పరమాత్మయగు శ్రీకృష్ణునియందు అనన్య భక్తి పాఠకులయందు కలుగుగాక!

మంగళం మహత్